GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుటకై

ఏర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౮] 28 ఫిబ్రవరి 1947 [సంచిక ౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువనకురకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలను. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బాంకులపైననే పంపవలెను.

## ఆంధ్రదేశములో అద్వితీయముగా నడుచుచున్న అసమాన చిత్రము

శ్రీమతి

కృష్ణవేణి నటించిన!

శోభనాచలవారి

# గొల్లభామ

డైరెక్టరు:

సి. పుల్లయ్య.

*Sobhanachala Pictures*



తారాగణం ;

- అంజలీదేవి
- కోటిరత్నం
- చంద్రకళ
- నారీమణి
- తీగెల
- వెల్లంకి
- ఏ. వి. సుబ్బారావు.

ప్రారంభము శనివారము ది. 22-2-1947

| | | | | | |
|---|---|---|---|---|---|
| బెజవాడ | — | మారుతీ | రాజమండ్రి | — | మినర్వా |
| గుంటూరు | — | రాధాకృష్ణ | విజయనగరము | — | పూర్ణా |
| కాకినాడ | — | మినర్వా | బళ్ళారి | — | ముబారక్ |

గురువారం ది 27-2-47 మొదలు

ఏలూరు — కేసరి. | బందరు — బృందావన్

*Distributors Except for Mysore & Nizams*

**Champria Talkie Distributors,**

MADRAS — BEZWADA — GUNTAKAL — SECUNDERABAD

## కలన చిత్రరంగమున నొక అపూర్వకళాసృష్టి శ్రీ వెంకట్రామా పిక్చర్సు వారి



# బ్రహ్మరథం

: బలిజేపల్లి  సంగీతం : మోతీబాబు

రం : వెంపటి  ఆర్టు : శర్మ

స్టూడియో: శోభనాచల.

దర్శకుడు : చిత్రపు నారాయణమూర్తి, బి.ఏ.,

శంకి, పారుపల్లి, రఘురామయ్య, ఎ. వి. సుబ్బారావు, జయమ్మ, సరోజ, సౌదామిని, టి. కనకం, శ్రీరంజని, అనసూయ.

---

ఆంధ్ర : పూర్ణా పిక్చర్సు, బెజవాడ.  రాయలసీమ : మల్లికార్జునాపిక్చర్సు, నంద్యాల.

నైజాము : డక్కన్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, హైదరాబాద్.

# విషయ సూచిక.





—(౦)—

శ్రీమతి హన్సామెహతా పేరుపొందిన బొంబాయి డాక్టరు జీవరాజమెహతాగారి ధర్మపత్ని. 1897 జననం. బరోడాలో విద్యాభ్యాసం. విద్యావ్యాపకమునకు బొంబాయిలో చాలా కృషిచేసినది. 1931 నుండి బొంబాయి విశ్వవిద్యాలయం సెనెటుసభ్యరాలు. 1937, 40 లలో బొంబాయి లెజిస్లెటివ్ కౌన్సిల్‌కు సభ్యురాలుగా ఎన్నుకోబడినది. 1945-46 అఖిల భారత మహిళాసభాధ్యక్షురాలు. గుజరాతీలో ఇంగ్లీషులో చాలాగ్రంథాలు వ్రాసింది. యునైటెడ్‌నేషన్స్ సభయొక్క ఆర్థిక, సాంఘికోపసంఘం-మానవహక్కుల కమిషన్‌లో భారతీయ ప్రతినిధిగా భారతప్రభుత్వంచే పంపబడినది.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# మా ఆశ, ఆశయము.

"గృహలక్ష్మి" పునరాగమనవార్త వినగానే ఆంధ్రనారీలోకం యధారీతిగా ఆప్యాయంగా తన ఆదరణచూప నారంభించింది. చాలామంది స్త్రీలూ పురుషులూ ఆశీర్వచనాలను, స్వాగతాలను, గద్యరూపకంగా, పద్యరూపకంగా ప్రతీరోజూ మాకంపుతూ ఉన్నారు. పూర్వపరిచయం కలిగిన రచయితలే కాకుండా, కొత్తవారు కూడా తమ రచనలను—కథలు, గాథలు, వ్యాసాలు, నాటకాలు, ఇంకా ఇతర విధములైన వాఙ్మయ విశేషాలు—కుప్పతిప్పలుగా మాకార్యాలయాని కందజేస్తూ ఉన్నారు. దీనికి, వారందరికీ మేమెంతైనా కృతజ్ఞులం. వారి ఆదరణకూ, అభిమానానికీ, అంతకంతకూ అధికంగా పాత్రులంకావడానికే మేము నిత్యమూ కృషిచేసి ప్రయత్నిస్తాము.

"గృహలక్ష్మి" ముఖ్యంగా స్త్రీలకోసరం ఉద్దేశింప బడిన పత్రికా, అనివేరే చెప్పడం అక్కరలేదు. అయితే "గృహలక్ష్మి" సర్వవిధాలా విజ్ఞానవంతురాలై గృహాన్ని చాకచక్యంతో ఆదర్శప్రాయంగా నిర్వహించగలిగిన రోజున ఆకుటుంబ యోగక్షేమాలకు అభ్యుదయపరంపరాభివృద్ధి అవిచ్ఛిన్నంగా సాగిపోతుందన్న మాటే. అలాంటి కుటుంబాలు, కొన్నికూడితేనే గ్రామాలూ, పట్నాలూ, ఏర్పడేది. అలాంటి గ్రామాలూ, పట్నాలూ, కొన్ని విలక్షణాలతో జతగూడితేనే దేశం అవుతున్నది. కాబట్టి "గృహలక్ష్మి"

ఆదర్శం బాహుళ్యానికి దేశకళ్యాణమే. దేశకళ్యాణమండపంలో స్త్రీలనీ, పురుషులనీ వేరు వేరుకాదు. అందరూ తృప్తితో, ఆనందంతో, సుందరంగా అలంకరించుకొని, కళాకాంతులతో కలిసిమెలసి తిరుగుతారు. అందుచేత ఈ "గృహలక్ష్మి" పత్రికానిర్వహణంలో స్త్రీలకెంత బాధ్యతవుందో పురుషుల కంతకన్న తక్కువలేదు. అయితే ముఖ్యంగా ఇందులో స్త్రీల సమస్యలనే వర్ణించి, వివరించి, చర్చించి, విమర్శించి, ప్రబోధము సాగించడానికి ఉద్దేశించినాము కాబట్టి వాటిని స్త్రీలే హెచ్చుగా రచించడం న్యాయం. కాని అనుభవ పర్ణులైన పురుషులుకూడా అలాంటివానినిగూర్చి వ్రాయడానికి సమర్థులే. కాబట్టి "గృహలక్ష్మి"లో ఎక్కువగా స్త్రీల రచనలకే తావిస్తూ, పురుషులు వ్రాశేవాటినికూడా అర్హతచూచి, యథోచితంగా ప్రచురింప దలుచుకొన్నాము.

"గృహలక్ష్మి" ప్రారంభించిన నాటికీ, నేటికీ 18సం॥ లు గడిచినవి. కాలం చాలా మారిపోయినది. ఆనాడు, స్త్రీలకే ఏమి-పురుషులకున్నూ - రాజకీయ, ఆర్థిక, సాంఘిక పారిశ్రామికాది సమస్యలు అన్నీ ఆదర్శరూపకాలే. నేడు రాజకీయ స్వాతంత్ర్యము చాలావరకూ సమకూరినదనే రాజకీయ వేత్తలు అంటున్నారు. ఎప్పుడు పరిపాలనా స్వాతంత్ర్యము లభ్యమైనదో అప్పుడు మిగతసమస్య లన్నిటినీ, ఆచరణలో పరిష్కరించి తీర్చుకోవాలిగాని ఆదర్శాలుగా తత్వచర్చచేయడం శుష్కదండుగ. ఆకోరిక అప్పుడే దేశంలో ఎక్కడ చూచినా కన్పిస్తున్నది. సంపూర్ణమద్యనిషేధం బోధిస్తూ కల్లుపాకల పికెటింగులుచేసి జైళ్లకువెళ్లారు గదా కాంగ్రెసువారు. వాళ్లే నేడు మంత్రులై మద్యనిషేధ చట్టాన్ని రాష్ట్రమంతటా ప్రవేశపెట్టక వెనకాముందూ ఆలోచిస్తున్నారు. విదేశీ అయినా సరే, స్వదేశీఅయినా సరే, మిల్లుగుడ్డ-అన్నదెల్లా బహిష్కరించమని బోధిస్తూ, బట్టల దుకాణాల దగ్గర పికెటింగులుచేసి పూర్వం తలలుపగులగొట్టించుకున్నారు కాంగ్రెసువాదులు. ఈరోజున వారే చాలామంది ప్రకాశంగారి బట్టలమిల్లుల బహిష్కార విధానాన్ని తీవ్రంగా ఎదుర్కొంటున్నారు. ఇందుకనివారిని, వారినిమేము దూషించడంలేదు;భూషించడం లేదు. ఆదర్శప్రపంచంలో నుంచీ వాస్తవిక జగత్తుకు దిగేటప్పటికి దృక్పథాలు ఎట్లా మారుతవో, స్థితిగతులు ఎట్లా ఉంటాయో తెలుపడానికే వీటిని సూచించాము. కాబట్టి మారచయితలు ఈమార్పును బాగా గమనించి, ఆ యాసమస్యలను వాస్తవిక దృష్టితో పరిశీలించి, వివరింప దగును అని కోరుతున్నాము. అట్లా అన్నామని ఆదర్శాలను మరచి

పొమ్మనడం లేదు. ఆదర్శాలు అవశ్యమూ జీవితాలను ఉన్నత పథాల నడపడాని కవసరమే. ఉత్తమాదర్శాలను సాధించడం కొరకూ పడే పాట్లలోనే సుఖమూ, సౌందర్యమూ, సంతోషమూ ఇమిడి ఉన్నవి. అందుకనే స్త్రీలకోసరము పెద్దలు నోములని, వ్రతాలని ఏర్పాటు చేశారు. కాబట్టి మేముకోరేదంతా, మాసోదరీమణులు యదార్థమునూ, పరమార్థమునూ, సమన్వయ పరుచుకొంటూ రచనలు సాగించండీ, అనే.

అట్లాంటి దృష్టితోనే మేము "గృహలక్ష్మి" లో 'బ్రతుకు తెరువు' 'గృహ వైద్యము' 'ఇంటిపనులలో మెలకువలు' 'పాకకళ' ఇత్యాది విషయాలకు తావిస్తున్నాము. అవి అచ్చులో వచ్చాయికదా అని వేదవాక్యములుగా భావించకండి. వాటిని స్వయంగా ఆచరించి మాసోదరీ మణులు తమతమ అనుభవాలను మాపత్రికా ముఖాన తెలుపండి. పలువురు తమతమ అనుభవాలను ఇతరులవానితో పోల్చిచూచుకొంటూ ఉంటే, పొరబాట్లను సరిదిద్దుకొని వాస్తవికజ్ఞానాన్ని అభివృద్ధిపరుచుకోవచ్చు; దానివల్లమంచిఫలితాలను సాధింప వచ్చు. అలాంటి అనుభవాలున్నూ, గాథలున్నూ ఎడతెగని వాఙ్మయము కూడా అవుతుంది.

కొంతస్వాతంత్ర్యం చేకూరిందంటున్నారు. ఇంకకొంత చేకూర బోతున్నదంటున్నారు. ఆస్వాతంత్ర్యమునువహించి ప్రభుత్వ పరిపాలనను ప్రజాప్రతినిధులు సాగించవలెను. ప్రజలంటే స్త్రీపురుషులందరూ గాని ఒక్క పురుషులేకాదు. స్త్రీలు ఎంతవరకూ తమవిధులను నిర్వర్తించక, హక్కులను అనుభవించరో, ఆ మేరకు, పురుషులే ఆబాధ్యత వహించి స్త్రీల యొక్క విధులనూ, హక్కులనూ కూడా నిర్ణయిస్తుంటారు. కావున స్త్రీసంపూర్ణంగా ఈపరిణామంలో పాల్గొనవలెను. కాని స్త్రీప్రత్యేకతా తత్వమును పెంపొందించుకోరాదు. పురుషుడికి సరిసమానమైనతోడై, అన్నిరంగములలో నడచి, ఆయా ఉద్యమాలకు, కార్యకలాపాలకు సంపూర్ణత నివ్వవలెను. నాడే దేశానికి సంపూర్ణమైన వికాసంకలుగుతుంది. కావున స్త్రీలు అట్టిశాంతియుతమైన విప్లవంలో సంపూర్ణంగా పాల్గొనడానికి ఆటంక ప్రాయములగు ఆచారవ్యవహారాలను కేవలము విమర్శించడంతో సరిపుచ్చుకోక, వాటిని తొలగించడానికి ఆచరణ సాధ్యాలైన ఉపాయాలను చర్చించి నిగ్గుదేల్చి, మన ప్రతినిధులకు మంత్రులకు స్త్రీలు అందించ వలసియున్నది. అలాంటి వాటిని పురస్కరించుకొని స్త్రీ ప్రతినిధులు మంత్రిణులు చట్టరూపానికి వచ్చేట్లు కృషిచేస్తారు. అలాంటి ఉపాయాలను

తనప్రాంగణంలో సూచించను, వివరించను, చర్చించను, మా "గృహలక్ష్మి" ఆంధ్ర నారీ లోకాన్ని నిరంతరము బొట్టుపెట్టి పేరంటానికి పిలుస్తుంటుంది.

వీరారాధన పురోభి వృద్ధిగోరే ప్రతివారికీ అవసరమే; స్త్రీలకున్నూ అంతే. మన పూర్వులు ఏదైనా క్లిష్టమైన సంఘటనలో ప్రాణార్పణం గావించినవారిని, సాహసించి నిండు మనస్సుతో సహగమనంచేసిన వారిని, పలువురు స్త్రీలను దేవతలుగా రూపించి కొలుపులు, ఉత్సవాలుఏర్పరచి స్త్రీపురుషులందరినీ వారినిఆరాధించమనినిర్ణయించారు. అయితే మూఢాచారులు వాటిని జంతుబలులతో నింపి వాటి ముఖ్యోద్దేశమే నశింపజేశారు. నేడుపాశ్చాత్య విద్యావేత్తలై, ఉద్యోగాలూ, అధికారాలూ నిర్వహిస్తున్న వారిని, ఆధునిక కార్య కలాపాలకు దానధర్మాలు చేసినవారిని, స్త్రీలను గొప్పగా పొగుడుతూ ఉంటారు. అది కూడ దనము. మేము ప్రతినెలా అలాంటివారి చరిత్రల ప్రచురిస్తూనే యున్నాము. అయితే ఆధర్మగుణమూ, ఆప్రజాహితచింతా ప్రాచీన కాలమునుంచీ ఎడతెగకుండా వస్తున్నదే అని తెలుసుకోవడంకూడా జీవికి ఉత్సాహకరము; ఉజ్జీవకరము. అందుచేత మనపూర్వులలో గుళ్లు గోపురాలు కట్టించిన వారిని, సత్రాలు చావిళ్లు నిల్పినవారిని, తోపులు తోటలు వేయించిన వారిని, చెర్వులు దొరువులు త్రవ్వించిన వారిని, అన్నదానం వస్త్రదానం చేసినవారిని ప్రజాహితార్థమై (అనంతపురంలో) ముసలమ్మవలె ప్రాణార్పణం చేసినవారిని, ఇంకా ఇలాంటి ఇతర ఉత్తమమైన కార్యాలు చేసినవారిని గూర్చి వ్యాసాలు, వారికి సంబంధించిన పాటలూ, ఫోటోలూ మాకుపంపితే అందరికీ వెల్లడి పరచి వారికీర్తి చాట దలుచుకున్నాము.

సామాన్యంగా స్త్రీల సమస్య అంటే దాంపత్యధర్మమే, అనితలచి చాలమంది తమ వ్యాసాలకు, కథలకు, నాటికలకు అదే కథావస్తువుగా చేస్తుంటారు. అది అన్నిసమస్యల కున్నూ మిన్న అయితే, కావచ్చు; బహుశా కేంద్రమున్నూ కావచ్చు. అయితే స్త్రీ స్వాతంత్ర్య పిపాసకల్గి, క్రొత్తఆశలకు, కొత్తఆశయాలకు చేతులు జాచేసరికి, ఇంటా, బయటా కూడా అనేక అవరోధాలు కలుగుతాయి. సుస్థిరంగా పీఠంవేసుకొని కూచున్న ప్రయోజనాలు, బిఱ్ఱబిగుసుకొని ఒకరాగాన కదలవు; మెదలవు. వాటిని పెళ్లగించి వేయడం కృత్యాద్యవస్థ అవుతుంది. ఏజోలికీ పోనివారికికూడా అనేక సమస్యలుంటవి. వక్కమొగుడే గాదు, స్త్రీని చిక్కులు పెట్టేది. అవస్థాంతరాలనుబట్టి, తండ్రి, కొడుకు, తమ్ముడు, అన్న, బావ, మరిది, మామ, అల్లుడు, మొదలైన పురుషులేగాక, చవితితల్లి, అత్త, ఆడబడుచు, తోడికోడలు

కోడలు—లాంటి సాటిస్త్రీలు కూడా స్త్రీని బాధిస్తారు. అందులో అనాథలైన స్త్రీల అవస్థ చెప్పనక్కర్లేదు. కొందరు ఆ స్థితి లేక బాధపడుతుంటే, ఆ స్థితి ఉండికూడా అజమాయిషీ చేసుకోలేక, కొందరు దానిని పురుషుని కప్పగించి, గుడ్లనీరు కుక్కుకుంటూ వారింట బలుచాకిరి చేస్తుంటారు. వారికి ధర్మశాస్త్రరీత్యా తమకు గల హక్కులు ఏవో తెలియవు; న్యాయశాస్త్రరీత్యా గలవేవో తెలియవు. కొందరికి సిరీ, సంపత్తూ, సౌభాగ్యమూ అన్నీ ఉండికూడా ఆనందం ఉండదు. కొందరికి సంసారలంపటంతో ఆత్మికింపైన ఏకళాభిరుచియో, భాషాభిమానమో, మరింకేదైనా ధర్మాసక్తియో, తీరనికోరికయై పీడిస్తుంటుంది. ఇంకా ఎన్నో, ఎన్నో ఇలాంటివన్నీ? ఎన్నని చెప్పము?

అయితే స్త్రీ సహజంగా ఎన్నికష్టనష్టాలున్నా కుక్కిన పేనువలె అనుభవించడానికే అలవాటు పడినది. కాని తగని అవస్థయెడల అసంతృప్తి, అసహ్యత, ధిక్కారము, ధ్వంసము, పునర్నిర్మాణము, ఎవర్కైనా పురోభివృద్ధికి మెట్లుగా నేటికాలంలో కనిపిస్తున్నవి. అయితే,అందుకని సంఘాన్ని, పురుషుణ్ణీ, ధర్మాన్ని దూషిస్తూ పత్రికలనింపిలాభం లేదు. తలలు విరియబోసుకొని వెర్రిశివాలాడినన్నీ, లాభంలేదు. వాటిని చక్కగా, వివరంగా, వెల్లడి పరచి, వానినుండి తప్పించుకొనుటకు, సక్రమమైన స్థితిగతులు నిర్మించుటకు, ఉపాయాలను వెతికి, ఆచరించి, ఫలితాలను దీక్షతో సాధించవలె. క్రమానుగతంగా తమకు కలిగే అనుభవాలను ఇతరులకొరకు ప్రచురించవలె. అలా వెల్లడించడానికి, ఆయాఉపాయాల నరయడానికి, తమతమ అనుభవాలను తిరిగీ ప్రచురించడానికి, మా "గృహలక్ష్మి" పుటలు ఆంధ్రసోదరీ మణులసొమ్ము అనిచెప్పుచున్నాము. స్త్రీసహజంగా మానవంతురాలు. ఆమెకు సిగ్గే సింగారము. అయితే మా "గృహలక్ష్మి" కార్యాలయానికి ఏ అబలయైనా తన గోడు నిరభ్యంతరంగా ప్రచురణార్థంపంపవచ్చు. అవి రహస్యంగా ఉంచబడతాయి. సంపాదకసాంప్రదాయ ప్రామాణ్యమున భద్రముద్రితమై ఉంటాయని ప్రమాణవచనంగాపలుకుతున్నాము. ఆర్తురాండ్రైన ఆంధ్రసోదరీమణులు మా "గృహలక్ష్మి" యెడ విశ్వాసముంచి మానమ్మకమును కొల్లగొట్టవచ్చు. ఔచిత్యానికి భంగలేకుండా, చట్టానికి విరుద్ధంగాకుండా, ప్రచురించడానికి వీలైనదంతా ప్రచురిస్తాము. అన్ని స్త్రీ సమస్యలను తీర్చే భద్రచింతామణి యేదో మావద్ద ఉన్నదని మేము బడాయి కొట్టడంలేదు. మాసోదరీమణులు తమబాధలను, చిక్కులను, లోకమునకు వివరించి విజ్ఞులవల్ల తరుణో

పాయాలను తెలుసుకొనడానికి మా "గృహలక్ష్మి" పత్రిక సాధనభూతం కావలెననే మా ఆత్రము. వెయ్యేల, ఆంధ్రనారీ లోకానికి మా "గృహలక్ష్మి" చెలి, చేటి, చుట్టము, గురువు, న్యాయవాది, వైద్యురాలు, కావ్యము, నిఘంటువు, ఉపశృతి, మొదలైనవి అన్నీ కావలయుననే మా ఆశ, మా ఆశయము. మేము ఊరక నిమిత్తమాత్రము. పై అన్ని విధములా "గృహలక్ష్మి" చే సేవచేయించుకొను భారము ఆంధ్రమహిళల పైననే యున్నది అనిమాత్రము విన్నవించు కుంటున్నాము.

---

కొత్తగా అత్తింటికి వెళ్లే ఆడబడుచుకు

## హితబోధ.

మాసపత్రికలలో మానిత విఖ్యాతు
లనుబొందిమను 'గృహలక్ష్మి'వోలె
దేశభాషలలోన తేనియతేటనాఁ
గొనియాడఁబడు నట్టి తెనుగువోలె
నిఖిలరాగములందు నిరుపమయోగ్యత
లంది భాసిల్లు కళ్యాణివోలె
వివిధసూనములలో వెలలేనిమన్ననల్
బడసి రంజిల్లు సంపంగి వోలె

వ్రతము లన్నిటియందు దివ్యంబునగుచు
సతతముసుకీర్తిఁగూర్చు సూనృతమువోలె
స్త్రీలలో మేలుబంతియౌ సీతవోలె
సంచరింపుచు సత్కీర్తిఁ గాంచుమమ్మ!

— ఎన్ని అప్పారావు.

# ఎన్నటికో?

శ్రీమతి సి. జానకిగారు

ఆలూ మగళ్ళ అన్యోన్యతకూ
అడ్డంతగిలే అత్తలపోరూ
అంతం పొందేదెన్నటికో ?

చీటికి మాటికీ, చిన్నతప్పులకు
చిటపటమంటూ, పటపటమంటూ
ఆదరించకా అటమటబెట్టే
ఆడబిడ్డలా, అత్యాచారం
అంతం పొందేదెన్నటికో ?

తళుకూ, బెళుకూ, తమాష చేసీ
"తలగడమంత్రం" తలకెక్కించీ,
తల్లీబిడ్డకు తగవులు పెంచీ
వెఱ్ఱిమగళ్లను వేరుకాపురం
వెడలించే ఆ కోడలి తంత్రం
అంతం పొందేదెన్నటికో ?

ఆలుమగళ్లు, అత్తాకోడలు
వదినా మరదలు వద్దికకలిగీ
సంసారాన్ని సర్దుకుపొయ్యే
"సాఫీ"రోజులవెన్నటికో ?

ఇంట్లో భార్యను ఇడుములపెట్టీ
ఒంట్లో నగలను ఒలుచుకపోయీ
సానిదాని సాంగత్యముచేసీ
మద్యపానమున మతిచెడిపోయీ
వజ్రశరీరం వాడివత్తలై
దుఃఖంచెందే దుష్టభర్తలను
దూరము నెట్టేదెన్నటికో ?

ఆస్తిపాస్తులు అమ్మివేసుకొని
కన్నకూతురిని, కష్టార్జితమును
చేతులోపెడితే మూతిముడిచుకొని
అలిగికూర్చునే అల్లుడుగార్లను
ఆవతల నెట్టేదెన్నటికో ?

పదహారేండ్ల బాలవితంతువు
పరుగులువారే తలపులవన్నీ
వలపులవన్నీ వెలుపలచూపక
పుట్టినచోటనె పట్టిచంపుకొని
కలకల కంట్లో కన్నీరొట్టుక
క్రుంగికృశిస్తూ కూర్చునియుంటే
లోపలి కుళ్ళును లోకులకంటికి
కనబడకుండా కప్పిపెట్టుకొని
మూడో పెండ్లికి ముచ్చటపడుతూ
తార్పుడు గాండ్లతో తిరిగేతాతల
తలలు బ్రద్దలా యెన్నటికో ?

# ఉత్తరహిందూదేశపు ఆచారములు

శ్రీమతి వంగల వాణీబాయిగారు.

(గతసంచికతరువాయి)

---

వీరిలో మేనరికం చేసుకోవాలనే పద్ధతిలేదు. అసలు అట్లాచేసుకోవడం చాలాతప్పనికూడా భావిస్తారు. రక్తసంబంధంఉన్నవారిలో పెండ్లిసంబంధంఉండకూడదంటారు. మేనత్తకొడుకు పిన్నతండ్రికొడుకుతో సమానమంటారు. ఆటుపినతండ్రికొడుకులో ఏరక్తసంబంధమున్నదో అంతే మేనత్తకొడుకులోకూడఉంది. గోత్రంమారినంతమాత్రాన్ని బంధుత్వం మారుతుందా? మేనత్తకొడుకునిచ్చిచేయతలుస్తే, పినతండ్రికొడుకు మాత్రంఏలపనికిరాడు? తురకలు అందుకుకూడా ఒప్పుకున్నారే.—అయితేతురకలట్లాచేస్తారని మనంనవ్వడం ఎందుకు? అసలు నాఅభిప్రాయం ఎంతదూరపుసంబంధంచేసుకుంటే అంతమంచిది. మేనరికమే చేసుకోవాలనే దురాచారం అసలుఒక్కఆంధ్రుల్లోనేఉందిగాని మరెక్కడలేదు. మనలోకూడఇప్పుడుచాలామట్టుకు చదువుకొన్నవారుమేనరికాలుమానేసిపైసంబంధాలుతెచ్చుకొనుచున్నారు. ఈవిధంగానే ఇంకా కొంతకాలానికైనా మేనరికంచేసుకోవాలనే ఆచారంపూర్తిగానశించిపోతే మనంబాగుపడతాము. బయటసంబంధాలుచేసుకోవడం వల్లమనకు 1. బంధుత్వంవ్యాపించుతుంది. 2. వీరికిపుట్టబోయేపిల్లలకు అటు వారి పోలికలూ ఇటువీరి పోలికలూకలిసివచ్చి గొప్పమేధావులు అయ్యేందుకు అవకాశంఉంది. 3 వారిలో వారే "ఇస్తి వాయనం, పుచ్చుకో వాయనం" అన్నట్లు వారిపిల్లనివీరు, వీరిపిల్లనువారు చేసుకునేకంటే బయటవారినిచేసుకోవడం వల్ల మనలో ఐకమత్యం ఎక్కువ అవుతుంది. మేనత్త మేనమామల బిడ్డలకు కొన్నిపోలికలుఇద్దరికీ కలిసేవి ఉండడం సహజమే గదా? మళ్లీవారికి పుట్టినబిడ్డలకుకూడ అవేగుణాలూ, అవేపోలికలూ రావడమా? మార్పు ఉండొద్దా? తల్లి తండ్రులిద్దరూకూడ అఖండమైనతెలివి గలవారైతే తెలివిగల పిల్లలుపుట్టడమూ-శుంఠలు పుట్టడమూ, నల్లవారైతేనల్లగా కాకివర్ణంతోపుట్టడం, తెల్లనివారైతే, నవనీతంలాగా జన్మించడం కన్నా, నల్లని వారూ తెల్లనివారూ వివాహంచేసుకొని చామనచాయపిల్లలను కనడం, అఖండమైన తెలివిగలవారు కొంచెం తెలివితక్కువ వారినిచేసుకునైనా ఒకమాదిరి తెలివితేటలైన పిల్లలను కనడంశ్రేయోదాయకంకదూ? ఈవిధంగా మనమంచిచెడ్డలు, బాగోగులు మనలోనే ఉండకుండా ఇతరులకు ఇచ్చి తెచ్చుకొన్నవాళ్లమౌతాము. మనజాతి (Nation) అభివృద్ధి చెందుతుంది. నేను అసలుచెప్పుచున్న ఆచారాలవిషయమై మధ్యలో ఆపి మేనరికంసంగతిలో దిగినందుకు చదువరులు మన్నింతురు గాక. ఆసంగతి వచ్చింది కాబట్టి అదిముఖ్యమని నాకు తోచి చెప్పడమైంది.

మనలో సాధారణముగా మొదటి కాన్పునకైనా పిల్లను పుట్టింటికి పురిటికి పంపుతాము; వీరు పురిటికి కోడల్ని పుట్టింటికి పంపనే కూడదట. కూతురికి పురుడు పొయ్యడానికి వీరింటికి తల్లి రాకూడదట. ఇంత ఘోరం ఎక్కడైనా ఉందీ? తల్లీ—తోడూ అటువంటప్పుడే (కష్టసమయాల్లోనే) కావాలనుకుంటామే!

ఇంకో తమాషా విన్నారా? పిల్లో పిల్లాడో పుట్టగానే, కన్న ఆమె తల్లితండ్రులకు వీరుమనిషిద్వారా గాని, పోష్టుద్వారా గాని ఒకరూపాయి పావలా (1-4-0) పంపిస్తారట. అదే మనమడుపుట్టిన శుభలేఖ.

దాన్ని ఇక్కడి వాళ్లు "భేలీ" పంపించడమంటారు. అశుభవార్త తెలుసుకొని ఆతాత, ముత్తవ్వలు, కూతురికి, మనుమనికి, అల్లునికీ 10-వ నాటికి కానుకలుపంపిస్తారు. భారసాల సాధారణంగా 11 వ నాడే జరుగుతుంది. భారసాలకు మనలోవలనే పీటలమీదకూర్చోటం ఉంది. పిల్లవాడు శాంతి నక్షత్రాన పుట్టితే శాంతికూడా చేసుకుంటారు. కానినూనెలో ముఖం చూపించడం ఉన్నట్లులేదు. తాత ముత్తవ్వలు మనమని భారసాలకైనా వచ్చేందుకు నోచుకోరు! ఒకవేళ వచ్చిన ఊర్కే చూచి వెళ్లిపోవాల్సిందే. ఏశుభకార్యం జరిగినా పిల్ల తల్లిదండ్రులు వారికి బహుమతులు తీసుకెళ్లాలేగాని అక్కడభోజనమైనా చెయ్యడానికి వీలులేదు.

మనలోవలెనే ఇక్కడకూడ అన్నప్రాశన, పుట్టువెండ్రుకలూ, అక్షరాభ్యాసం, వడుగు, (జనేవ్) అనేవేడుకలూ జరుపుతారు. వీటిలో పుట్టువెండ్రుకల వేడుక (ముండన్) మహావైభవంగా జరుపుతారు. ఆరోజునభాగ్యవంతులు మంగలికి చాలధనం ఇస్తారు.

ఏశుభ కార్యాలందూ, వీరు విందులిచ్చినప్పుడు, ఉడికిన పదార్థాలు పెట్టకూడదట! పప్పు, అన్నం. నిప్పుమీద కాల్చినరొట్టెలు మొదలైనవాటిని "కాచ్చాఖానా" అంటారు. వేయించిన పూరీలు, కచోడీలు, (అంటే మినప పూర్ణంతో చేసినపూరీలు) కూరలు, మిఠాయిలు మొదలైనవాటిని "పక్కాఖానా" అంటారు. విందుల్లో "ఈపక్కాఖానా"యే పెడ్తారు. ఇక్కడ భాగ్యవంతులంతా ప్రతిరోజూకూడా "పక్కాఖానా"నే భుజిస్తారు.

వీరి విందులకు మనబోటి వార్ని పిల్చారంటే, మన కడుపులే నిండవు! వీరుఅన్నం వండుకోవడం బహుఅరుదు. వండుకున్నప్పుడైనా బియ్యంనేతిలో వేయించి, పచ్చి భటాణీగింజలతో గాని బంగాళాదుంప ముక్కలతోగానిచేర్చి "పులావు" చేసుకుంటారు. మాంసము భక్షించేవారు దానితోకూడా "పులావు" చేసుకుంటారట. ఇక్కడి వారు కొందరు బ్రాహ్మలు కూడా మాంసాహారమును సేవించుతారు. బ్రాహ్మలలోకూడా చాలారకాల మంది మనలో మల్లేనే ఇక్కడాఉన్నారు. చౌబేలు, బాజిపాయిలు మిస్రాలూ, పాండ్యాలూ, శర్మలూ, అనిఇంకా అనేక రకాల వాళ్లున్నారు. వీరిలో కొందరు మాత్రమే మాంసం తినేబ్రాహ్మలు.

వీరిలో "ఘోషా" పద్ధతి ఇంకా ఇప్పటికీ నశించలేదు. ఆడవాళ్లుమగవారి కంటబడరాదు. క్రొత్తగా వచ్చిన కోడలు, ఇంట్లోమామగారు, బావగార్లు, మరుదులఎదట బొత్తుగా మసలరాదు. ఒకవేళ వారుకూర్చున్న చోటినుండీ పోవలసివచ్చినా ముఖంనిండా ముసుగు కప్పుకుని పోవాలి. కాని ఇద్దరు ముగ్గురు బిడ్డలు పుట్టిన వెనుక ఇంతకఠినమైనపర్దా అవలంబించవలసిన అవసరం లేదట. అప్పటికైనా తలమీద, ముసుగు తప్పకుండా వేసుకోవాలి. కులస్త్రీలు తలమీద ముసుగు వేసుకోకపోతే చాలతప్పు. వేశ్యలు మాత్రమే అట్లా ముసుగు లేకుండా వెళ్లారట.

వీరిలో మరొక ఆచారం ఏమిటంటే. ఎవరైనా స్నేహితులుగాని బంధువులుగాని దూరప్రయాణానికి బయల్దేరి వెళ్తూంటే, వారికి కొంచెం పెరుగు స్టేషన్‌కైనా సరేతీసుకు వెళ్లితినిపిస్తారు. అట్లాతినిపిస్తే వెళ్లేవారికి చలవట. మనలో చలిమిడి పెట్టినట్లు!

మనం చేసుకొనే పండుగలు గాక వీరిలో మరికొన్ని మనంచెయ్యనివి ఉన్నాయి, అవి: ఒకటి, "రక్షబంధన్" ఇది మన జంధ్యాల పౌర్ణమి అనే రోజున చేస్తాము.

ఇక్కడి వారు ఆరోజున చాలా వేడుకలు చేస్తారు. అత్తివారింట్లో ఉన్న అమ్మాయిలు ఆరోజు, తప్పకుండా పుట్టింట్లకు వస్తారు. తోడపుట్టిన వాళ్లంతా ఆరోజు కలుసుకోవాలంటారు. అన్నలకు, తమ్ములకు, ప్రేమతో తన సోదరి పట్టుదారాలతో చేసిన కంకణాలు కడుతుంది. దినమంతా నృత్యగీతాది వినోదాలతో గడుపుతారు.

రెండవది- "వసంత పంచమి". ఇదిసరస్వతీదేవి పుట్టినరోజు. ఆనాడు అందరూ వసంతవర్ణం చీరలు (లేత పసుపురంగుబట్టలు) ధరించి బయట తిరుగుతారు. అంటే వసంతఋతువు వచ్చిం దనితెలపడం. ఆరోజునహరికథా కాలక్షేపాలు, గానసభలు మొదలైనవి ఊరంతటా అతివైభవంతో జరుపుతారు.

మూడవది-"హోలీ" ఇది మార్చినెలలో(అనగా అదివీరి చైత్రమాసం) వస్తుంది. దీనికి, ప్రతిఇండ్ల వారునూకలిసి బయటకు, వారికీ, వారికి, తెలిసిన వారిండ్లకు ఆటలతో, పాటతో, గంతులు వేస్తూవెళ్లి కాగలించుకొని, వారి వంటినిండా వివిధ రకములైన రంగు నీళ్లనూ పిచికారీలతో జల్లి, వారి బట్టలు తడిపేస్తారు. వాళ్లు మళీవీళ్లమీద రంగునీళ్లను గుమ్మరిస్తారు. ఈవిధంగా గుంపులు, గుంపులుగా ఒక్కొక్క ఇంటికీ వెళ్లి రంగులతో ఆడుతారు. ఇండ్లలోనివారు వచ్చిన వారికి తినడానికి మిఠాయిలు, పండ్లూపంచిపెట్టి రంగునీళ్లు జల్లుతారు. ఆడువారికి కూడా ఆరోజు అంత కఠినమైన పర్దాలేదు. వారునూ గుంపులుగా పది మంది కలసి బండ్లలోగాని, కార్లలోగాని వారి స్నేహితురాండ్ర ఇండ్లకు వెళ్లి రంగులు ఒకరి మీద ఒకరు జల్లుకుంటారు. కొందరిండ్లలో ఆరోజున బావలూ, మరదళ్లు, వదినగార్లుకూడ ఒకరిమీద ఒకరు రంగలు జల్లుకోవచ్చునట ఇదికొంచం నాగరికులలోను, చదువుకొన్న వారిలోనేగాని, పూర్వాచార పద్ధతిగలవారు వారిపిల్లలను అట్లు మగవారితో ఆడనివ్వరు. ఈ హోలీ పండుగరోజున బ్రాహ్మణ, శూద్ర అనే తారతమ్యం లేకుండా, అంతా ఒకరితో ఒకరు సమానంగా ఆడుతారు. హోలీకి ముందురోజు సాయంకాలంనుంచీ వీధుల్లోనూ, పబ్లిక్ స్థలాల్లోనూ, పెద్దమంట వేస్తారు. దీనికి అసలు కారణం, పూర్వం భక్త ప్రహ్లాదుకు హోలీ దేవి అనే ఒకమేనత్త ఉండేదట. ఆమెకు శివుడు, మంటల్లోపడ్డా కాలకుండా ఉండేటట్లు ఒక 'వరం' ప్రసాదించాడట. ప్రహ్లాదుడు విష్ణునామాన్నే స్మరించు చున్నందుకు, ఎన్నికఠిన దండనలు విధించుమన్నా ఏ అపాయం కలుగకుండా ఉండడం చూచి, ఆమె మేనల్లుని తనవడిలో కూర్చోపెట్టుకుని మంటల్లోదూకితే, మేనల్లుడు పూర్తిగాకాలిపోతాడనీ,తాను అంతట బయటకు రావచ్చుననీ తలచి అట్లామంటల్లో ఆతన్నిఎత్తుకుని దూకిందట. కాని విష్ణుమూర్తిమాత్రం తన భక్తులను కాలనిస్తాడా? భక్తప్రహ్లాదుకు ఒకబొబ్బయినా ఒంటిమీద కాలేదట! మేనత్తహోలీ దేవిగారు మాత్రం పూర్తిగావళ్లుకాలి వెంటనే చనిపోయిందట. ఆమె అన్న హిరణ్యకశిపుడు మంచి ఆగ్రహంతో శివుని వద్దకు వెళ్లి, నాచెల్లెలికి కాలకుండా వరమిస్తివికదా, ఎందుకు కాలి చనిపోయింది? అని అడిగినాడట. అందుకు శివుడునవ్వి,"ఒకతీ ఎక్కడైనాపొరపాటున మంటలలోపడ్డా, విరోధులు ఆమెను మంటల్లోతోసినా, తగలబడ" దన్నానుగాని "దురుద్దేశంతో చిన్ని బాలుని చంపటానికి మంటల్లోఉరికితే బ్రతుకు తుంద" న్నానా అనిజవాబుచెప్పి పంపించాడట. అప్పుడుప్రహ్లాదుని తోడిబాలుర

ఆసంతోషాన్ని జరుపుటకు రంగు, రంగుల నీళ్లుప్రహ్లాదుమీదపోసి అతని దేహంచల్లార్చారట. ఆటలతో పాటలతో ఒకరిమీద ఒకరు రంగు నీళ్లుజల్లుకొన్నారట. అప్పటి నుండే నేటివరకూ ఈ హోలీ పండుగ ప్రతిసంవత్సరం, జరుపుతారు. వీరికిది సంవత్సరాది వంటిది. వీరుప్రతిమాసమూ పౌర్ణమినుండీ లెక్కవేస్తారు. మనం అమావాస్య నుంచీమొదలుపెడ్తాం. అందుకని వీరికీ, మనకూ పదిహేనురోజులు తేడాఉంది.

వీళ్లలో మన శ్రావణ మంగళారం నోముల్లాంటివి ఏమీఉన్నట్లు కనబడలేదుగాని, సావిత్రీదేవిగారి వ్రతంలాంటిది ఉన్నట్లుంది. ఇక్కడివారుదీన్ని "కజిలితీజ్" వ్రతమంటారు. ఇదిగాక ఇంకా ఏవో 2, 3, రకాలవ్రతాలు ఆడువారుచేసేవి ఉన్నాయటగాని మనం తెలుసుకోవాలన్నంత ముఖ్యమైనవి ఏవీలేవు. ఏవ్రతంచేసినా వీరు దినమంతా ఉపవాసంచేసి (మంచితీర్థమైనా పుచ్చుకోరు.) సాయంకాలం పూజచేసిన పిమ్మట ఫలహారం పుచ్చుకుంటారు. మనకు మల్లేనే వీరుకూడ సత్యనారాయణవ్రతం చేసుకొంటారు. కథ అంతా మనం చెప్పినట్లే పురోహితుడు చదివి పూజచేయించుతాడు. మనం పగలే సత్యనారాయణ వ్రతం చేసుకుంటాము. కాని ఇక్కడివాళ్లు కథలో చెప్పినప్రకారమే పగలంతా ఉపవాసంఉండి సాయంకాలం నుంచీ పూజప్రారంభించుతారు. ఇక్కడ దంపతులిద్దరూ పీటలమీద కూర్చోవాలన్న పట్టింపులేదు. ఇద్దరిలో ఒకరుమాత్రం కూర్చుని పూజచేస్తేచాలు. పూజసమయానికి చుట్టుప్రక్కల ఇండ్లవార్ని, బంధువులనూ పిలిచి సత్యనారాయణ ప్రసాదం పెడ్తారు. రవ్వ హల్వాయేచేసి ప్రసాదం పెట్టాలన్న పట్టింపులేదు. ఏరకమైన ప్రసాదమైనా నైవేద్యానికి పనికొస్తుంది.

ఇక్కడివారిలో ఒకమంచి తేలికైనపద్ధతి ఏమిటంటే, చచ్చిపోయినవారికి ప్రతి సంవత్సరం తద్దినాలు పెట్టనక్కరలేదు. మొదటి సంవత్సరంమాత్రం ఆతిథికే పెట్టాలి. కాని తర్వాత తద్దినాలు ఆతిథికిగాక ఎంత మంది ఆకుటుంబంలో చచ్చిపోయిన వారుంటే అంత మందికి కలిపి మహాళయ పక్షంలో ఒకరోజున పితృదేవతలందర్ని ఆహ్వానిస్తారు.

నేను తెలుసు కొన్నంతమటుకు వీరి ఆచార వ్యవహారాలను వ్రాయడమైంది. ఇంతకన్నా ఎక్కువ గాముందు ముందు ఇంకా తెలుసుకోగలిగితే మళ్లీ మిగతా విశేషాలను గురించి కూడా వ్రాస్తాను. ఈలోగా తెలిసిన వారెవరైనా ఉన్నట్లయితే, వారే వ్రాసిన యెడల నేనున్నూ నాకుతెలియని విషయము లను తెలుసుకొని సంతోషించెదను.

—:o:—

కాంత—కావ్యము.

కాంత చెప్పినయటు జెప్ప కావ్యమయ్యె,
పలుకు పలుకున తేనియ లొలుకునీవె,
'ధర్మ మిది' యని గిరిగీచి దారిజూప
నిలువ కిక యెవ్వ డేచెయ్వి నీరు దాఁటివు?

— పైడిపాటి వెంకటసుబ్బరామ శాస్త్రి.

—(o)—

# ఆఁడుకూయి.

[పాండవ రాయబారియై వెడలెడు కృష్ణునితో, తా బడిన యవమానములు, బన్నములం వలన బొందిచిట్లను గట్టుకొనిపోయి కుములుచున్న ద్రౌపదియాడిన మాటలివి.]

శ్రీమతి సోమంచి సూర్యకాంతమ్మగారు.

చెప్పెడిదేమి నీకు యదుసింహామ! కంటికి రెప్పవోలె మ
మ్మెప్పుడు గాచుమేటి, వి దేమేలగు; నంతయుగన్న నాకు నీ
విప్పుడు సంధి కేగ వగ పేటికి? కౌరవు లన్న బాండవుల్
నిప్పులు గ్రక్కుచుందురను నింద వశింపగ జేయ నెంచితే!

క్రొత్తలు లేవుగా మనకు, కుంతికి కోడలనైనదాది నా
చిత్తము మండుచున్నకత సెప్పనదా? ఇదెగాంచు వేణి, యీ
పుత్తడిపుట్ట, మీయమృతభోగము, లన్నయ! ఇట్టివృత్తమున్
రిత్తయొనర్చుటో! కథమరింతగ బెంచుటో! నీవయెంచుమీ!

వారికి పాండుసూనులకు పత్నిని, పాండవ పక్షపాతి కం
సారికి నీకుచెల్లెలను; అయ్యును చిచ్చోడిగట్టుకొంట, వే
సారుట, కంట నీరిడుట, చావదలంచుట తప్పవయ్యె; నె
వ్వారికి గావలెన్? ఎవరు వల్లెయటందురు ఆఁడుకూయికిన్?

అన్నయ! వారుధర్మమున కంజలివట్టు నజాత శత్రు, లీ
పిన్నలు వారి యన్ననుడి వేదమునా గను యోధమూర్తు, లీ
వన్ననొ వారిమాటలకె 'వహ్వా! భళీ!' యనుతాళగాడ; వే
నెన్న నభాగ్యురాల మిము నేటికి నూరక నాడి పోయగన్?

గదయును గాండివమ్ము, కలుగంగల బిడ్డల కాటవస్తు నం
పద నభివృద్ధిసేయ; గురువల్లభుడిచ్చెడు పల్లెలైదెవిటం.
కుదురుగ బొట్టపోసికొన గోరెడివారలె వీరలైన చో
నదమము నాకు కుంతి కదనమ్ముగ నిమ్మను గ్రామమొక్కడేన్.

—— (0) ——

గతసంచికలో

# పిదప వ్రాస్తానన్న హితవాక్యములు.

శ్రీమతి మైదవోలు పద్మావతిగారు.

భార్యలకు—

నీభర్త బల్లమీద, పుస్తకములు, చిత్తుగాగితములు, మూలమూలల, అన్ని దిక్కులయందు వుండ వచ్చును. వాటిని సవరించి, చక్క దిద్దవలెనని, చెల్లాచెదరైవున్నవాటిని, నీవు అతనిని అడుగకుండా తాకవద్దు. దానివల్ల నీభర్తకు చికాకేర్పడును. అతని బల్లమీద వున్నకాగితములు, ఏది, ఎక్కడున్నదో అతడెరుగును. ఎపుడేది కావలయునో ఏరితీసుకొనును. నీసవరింపులో కావలసిన, కాగితము లంత త్వరలో కనుపడవు. కావలసిన వస్తువు వెంటనే కనుపడకున్న చిరాకు కల్గుట మనుష్య స్వభావము. నిమిషములో కనుపడవలసిన దానిని, గంటల కొలది వెదుకవలెనన్న విసుగే కాదా?

నీభర్త వుత్తరములు, అతని యనుమతి లేనిదే నీవు చదువ వద్దు. నీమీద అనురాగము ఏర్పడ్డపిదప అతడు నీకేమియు దాచడు. అనురాగము, నమ్మిక సంపాదించు వరకు, అతని విషయములో జోక్యము కలిగించుకోవద్దు.

భర్తను వశపరచుకొనుటకు భోజనము ముఖ్యము. అతని కేదిఇష్టమో, అదికనుగొని, ఆవ్యంజనమో, భక్ష్యమో, నీవు ప్రీతిగవండి, ప్రియముగపెట్టవలయును. అతడు ఎక్కడో, ఏదో, తిని చాలా రుచిగ వుండినదని చెప్పిన ఆవస్తువెట్లు తయారుచేయవలయునో తెలుసుకొని, చేసి పెట్టవలయునేగాని, పట్టెవర్ధనముగా "అవును, పొరుగింటి పుల్లకూర రుచి. అట్లాచేయడానికి నాచేతగాదు. ఈవేళ ఎక్కడ తిన్నారో, దినం అక్కడే తినిరండి" అని యనకూడదు. విసురుడు మాటలకది సమయముకాదు.

భోజన పదార్థములలో, అతని కిష్టమేదో, అయిష్టమేదో తెలుకొన వలసినది నీవిధి.
ఒకానొక సందర్భమున, నీవిష్టపడు పదార్థమును చేయవలదని కట్టడి చేసి యుండ వచ్చును. మరొకసందర్భమున ఆపదార్థమునే (నీకిష్టమని తెలిసియుండుటచే) చేయుమనిన "నాడువద్దంటే వద్దని సాధించారే? నేడు మాత్రమెందుకు? మీరుచేయ మంటే చేయడం, వద్దంటే మానడం కాబోలు! నేచేయను." అనిమొండి పట్టు పట్టి నీకోపం వెలిపుచ్చవద్దు.

నీవు రుచిగా వండు వస్తువులు, నిమిషములో నీభర్తను నీచేతి కీలుబొమ్మను చేయును.

నీభర్త ఇంటికి వచ్చినప్పుడు "ఉప్పులేదు, పప్పులేదు, ఈవెధవ సంసారం నేచేయ లేను" అని వీధిలో అడుగు వీధిలోవుండగానే సొదమొదలు పెట్టరాదు. అత్త, ఆడుపడుచుల తగువులం వాకిటే ఏకరువు పెట్టి, ఏడ్చి, ఇల్లంటే నరక మనుకొన్ననట్లు ప్రవర్తించవద్దు.

అతడు కులాసాగా, సంతోష సమయములలో అతని వుద్యోగమును గూర్చియో, అతని విజ్ఞానమును గూర్చియో, తెలివి తేటల గూర్చియో, గొప్పను గూర్చియో, వ్యాపారములోని లాభనష్టముల గూర్చియో, నీతో ఉల్లాసముగ ముచ్చటించు నపుడు, నీవు, అలక్ష్యముచేయక, అడ్డుచెప్పి అతని ఉత్సాహభంగము చేయక, నిరసించక వోర్పుతో వినవలయును. నవ్వకూడదు. పరిహసింప కూడదు. ఈగొడవంతా నాకెందుకండీ, అని చివ్వునలేచి పోకూడదు.

మాటాడు నపుడు చెవియొగ్గి వినిన మాటాడు చున్న మానవునికి సంతోషము, తృప్తి కలుగును.

ఒకవిషయమును గూర్చి నీతో సగంచెప్పి, సగంచెప్పకున్న అంతా చెప్పమని నిర్బంధించ కూడదు. పూర్తిగాచెప్పటావశ్యకమైయుండదు. ఉత్సాహము లేకపోవచ్చును. కనుక నీవుచెప్పమని పీడించవద్దు. అట్టిసమయములలో, అతని, నోటినుండి మాట వెళ్లదీయుటకు గుచ్చి గుచ్చి, "అదిఏమి" "ఇదిఎందుకు" "మీకెలాతెలిసింది" "ఎవరు చెప్పారు" అనిప్రశ్నలవర్షము కురిపించి విసిగించ కూడదు.

కొన్ని విషయములు నీకుతెలియకూడదని మరుగు పరచి యుండవచ్చును. అటువంటి సందర్భములలో అదినీకు తెలిసినను, తెలియనట్లే వుండవలెను, కాని C. I. D. (గూఢాచారి) పోలీసు వలె, రహస్యము గ్రహించినానన్న గర్వముతో అతనిని సవాళ్లువేసి జవాబు లడుగకూడదు.

అట్లుచేసిన నీపెనిమిటికి నీమీద విసుగు, కోపం రెండూ కలుగును.

మనుష్య స్వభావము విచిత్రము. ఒకని స్వభావమువలె మరొకనికుండదు. ఒకని కొకవిషయమం దభిరుచి వున్న, అతని తమ్మునికే ఆవిషయమం దనాదరణ, అసహ్యము యుండ వచ్చును.

తోటపని యందొకని కిష్టముండును. అతడు తోటకూర, మళ్లలోనే, తనతీరిక సమయ మంతా వ్యయ పరుచును. అతని తమ్ముడే టెన్నిస్ (Tennis)లో తన కాలమంతా గడుపును. ఒకడు తీరికవుండి, చేతడబ్బువున్న సినిమాలలోనే జీవించును. మరొకడు సంగీతమన్న చెవికోసు కొనును. (Dance) నాట్యము అంటే అదేపనిగాచూచే వాడింకొకడు. (Cricket match) క్రికెటుమాచ్ చూచుటకు ఆఫీస్‌కు కూడా సెలవుపెట్టి హాజరగువారు కొందరు.

ఇవన్నియు నీకిష్టములేక పోవచ్చును. సాధారణముగ భర్తకిష్టమైనది భార్యకు సుతరాము పనికిరాదు. అతడిష్టపడియేకదా ఆపనులు చేయును. గనుక అతనిని "ఏమిటండీ అలా పెట్టితే ఆరుకట్టలు ఆకుకూర, దీనికోసం ఎందుకింత పాటు పడడం, 300 జీతంతెచ్చు కుంటున్నారే, అర్ధణా ఆకుకూరకొనలేరు, మీరీ పనులను చేయడం నాకుసిగ్గుగవున్నది, అనియు; రోజూఏమి (Tennis) అండీ, మీకు విసుగు లేదేమొ కాని నాకేమొ తలనొప్పిగావుందండీ, ఎన్నాళ్లీటెన్నిస్, మానేసి ఇంట్లోఏదోకబుర్లుచెప్పరాదా, యనియు; అబ్బబ్బా, ఏమిసినిమాలండీ, చూచినదే చూడడం తప్ప మరేమన్నా వుందా అవేమి బాగున్నాయనీ ఇలాడబ్బు

తగులు పెడుతున్నారు, నిద్రపాడుచేసుకుంటున్నారు, అనియు; ఈసంగీత కచేరీ చేసేవాళ్లకైనా సిగ్గుండాలె, పోయే వారికైనాసిగ్గుండాలె, తలనొప్పిపుట్టే సంగీతానికి డబ్బిచ్చి వేరేపోవాలా, ఆడబ్బులుంటే వారంరోజులు సంసారంజరిగి పోవును; అని ఇలాగే అన్నిటికన్ని చెప్పి, వారికుత్సాహంభంగం చేయకూడదు.

తీరికసమయములలో, ఆతడేపని తలపెట్టినా అడ్డుచెప్పి, నిరుత్సాహ పరుపక, నీవుకూడా అతనికి సహాయము చేసిన, మీప్రణయలత దినదిన ప్రవర్ధమాన మగును.

పురుషు లనుభవశాలులు.

భర్తమాటలు నీవెప్పుడు త్రోసివేయకూడదు.

'నిచ్చెన కదులుచున్నది. దానిమీద ఎక్కవలదు. పడిపోగలవు, జాగ్రత్త' యని మగడంటే 'నాకు తెలియదేమి, నేను ఎన్నడు నిచ్చెనెక్కనేలేదా, నేనేమంత బరువున్నాను కొందరివలె' యని యతనిమాట అలక్ష్యపరచి, ఆనిచ్చెనమీద ఎక్కిపడిపోవద్దు. పడినమీదట, "పడ్డావా యనికూడా యడుగలేదే, ఆకఠిన హృదయుడు" అని విచారించవద్దు. విచారించి ప్రయోజనములేదు. ఒకవేళ ఏదైనా అంటే "నేనప్పుడే చెప్పలేదా, విన్నావా" యన్నమాటేవచ్చునుకాని, "అయ్యోపాపం, దెబ్బతగిలినదా, ఎక్కడ తగిలిన" దన్న యను నయవాక్యములురావు.

నీభర్తస్నేహితులను అలక్ష్యము చేయవద్దు. వారిని చూడగానే విసుగుకొనవద్దు. వారిని ఉపచరింప మరువవద్దు. వారిలో కొందరు నీకు సరిపడక పోవచ్చును. అట్లున్నను, నీవు పైకి తేల కూడదు. నీభర్త స్నేహితులు, నీస్నేహితులు కారా? వారిని నీవెందుకు దూషించడం?

ఈస్నేహితులు స్త్రీలైతే నీవెంతో జాగ్రత్తగా మసల వలెను. వారికి మరియాద లోపం చేయవద్దు. నీప్రేమలో వారుపాల్గొంటున్నారేమో నని సంశయించి నిందింపవద్దు. మిత్రులు ఎన్నటికిని మిత్ర ద్రోహము చేయరు. కనక వృథా సంశయించి, నీమనసు పుండుచేసుకొని, నీభర్తమనసు పుండుపరచవద్దు. నీవువారిని ఎంతమరియాద చేసిగౌరవించెదవో, అంతకంత నీభర్తనిన్ను, ప్రేమించి, గౌరవించి, ఆదరించును.

నీవెల్లప్పుడును, శుచిగ, శుభ్రముగ, శృంగారించుకొని యుండుము. "నాకెందుకు, శృంగారించుకొని ఎవరిని మోహింప చేయవలెను? ఇట్లావుంటే వెళ్లిపోదా నాజీవితం? పెళ్లికాని వారివలె పెళ్లి ఆయినవారి కెందుకు శృంగారం" యని యనుకొనవద్దు. "సిగ్గుపడుటకల్గి సింగారమునుకల్గి" యనిసీతను గూర్చిపోతన వూరకఅనలేదు.

నీభర్తకు నీవునిత్యము శృంగారించుకొని, కన్నులపండువు చేయవలయు ననియే యుండును. అతడు సంతోషముగ వున్నప్పుడు, నీవున్న వొకటి రెండునగలు ధరించుకొనుము. కూడినంతవరకు శుభ్రముగను, నాగరికముగను వుండ ప్రయత్నించుము. ఆమాట అన్నానని నగలకు, చీరెలకు నీభర్తను వేధించవద్దు.

నలుగురిలో నిన్ను వెంటపెట్టుకొని వెళ్లుటకు నీభర్త సిగ్గుపడునట్లుమాత్రం, నీవెన్నడు, మాటలలో కాని, వేషములోకాని, చర్యలలోగాని ప్రవర్తింపవద్దు.

నీమాటలలో, ప్రవర్తనలో, చాతుర్యము, చాకచక్యము కనుపరచవలెను.

నీభర్త చదువుల సరస్వతియై, మహామేధావిగ నుండవచ్చును. హాస్యరసమూర్తిగ నుండవచ్చును. అతి చాకచక్యముగ మాటలాడు సరసతగల వాడుగనుండ వచ్చును. అతనితో సరిసమానముగ చర్చింప నీకు

సామర్థ్యము లేకపోయినను, అతని మేధాసంపద కనుగొని, అర్థముచేసుకొని, సంతసింప వచ్చునుకదా. అతడే విద్యలో ఆంజవేసిన చేయియో, ఆవిద్య నీవు కొంతయైనా నేర్చుకోవలెను. రాదని నిరాశపడవద్దు. 'ముదితల్ నేర్వగ రాని విద్యకలదే ముద్దార నేర్పించినన్' యన్నారు.

నీభర్త పేరు పొందిన రచయితగా నుండవచ్చును. నీవును గ్రంథములు రచింప వలెనను అవసరములేదు. కాని, ఆరచనలను యర్థము చేసుకొను రసికత నీయందుండ వలెను. అతని రచనల చదివి నీవానందించిన నీకన్న యధికానందమును అతడనుభ వించును.

పండుగలన్న కొందరికి ప్రీతి. కనుక విరివిగ పండుగలు—ఏదో, పుట్టినరోజని మరొకటని, కల్పించుకొని పండుగలు చేయవలెను.

ఇరువురికి —

వివాహమైన పిదప, ఇరువురు వేరన్న భావము వుండనే కూడదు. ఇరువురు వొక్కటన్న భావము పెంపొందింప వలెను. ఇట్లన్న భర్తకోపిష్టియైన, భార్యదాసి కావలెను; భార్యగయ్యాళైన, భర్తదాసుని వలె నుండవలెనన్న యభిప్రాయము కానేకాదు.

సంసారజీవితములో, ప్రతికార్యములోను, ఇరువురికి సమభాగమున్నదని తెలుసుకొన వలెను.

ఇతరుల ముందు, మీమనోభావములు, ఒకరియందు వొకరికున్న యనుమానములు వెలిపుచ్చకూడదు. ఒకరినొకరు, ఇతరులముందు వెలితిపరుచు కొనగూడదు.

మీరువంటరిగ వున్నప్పుడు, మీతప్పులు నిరూపించుకొని అత్యవసరమైతే శిక్షించుకో వలెను. క్షమించుట శిక్షించుట కన్నను ప్రబలతరమైన పదునుగలదని ఉభయులు గ్రహించవలయును. అసలు తమ తప్పులు పరస్పరము తెలిసెననుటయే గాయమగుట. శిక్ష ఆగాయమున ఉప్పుగూరుట. కాని క్షమ ఆగాయమునకు చల్లనిమానుమందు వ్రాయుట యగును.

సంసారభారం భరింపలేక చిటమట పడుటతప్పు. చరచర కల్గువిషయములు ఎప్పుడు మాట్లాడ కూడదు. సంతోషముగ వున్నప్పుడు, పాతకలహాలు జ్ఞప్తిచేసి, కెలికి, కోపము తెప్పింప కూడదు.

ఒకరి నొకరు గౌరవింప నేర్చుకోనవలెను, గౌరవభావము కల్గిన సుఖమేకాని, వేరుండదు, ఒకరిజీవితమునకు మరొకరావశ్యకమనియు, ఒకరులేకున్న మరింకొకరికి సంసారము నిస్సారమనియు, తోచిన, ఒకరెక్కువ, వొకరు తక్కువయన్న భావమునకు చోటేలేదు. ఈగౌరవము మాటలలోనే కాక చేతలలో కూడా యుండవలెను. అట్లున్ననే అద్వైతమైన అనుకూల దాంపత్యం; లేకపోతే వారు, కేవలం భార్యా-భర్తా మాత్రమే!

—:o:—

# భోగంమేళాల నిషేధం.

## శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు, (ఎం.ఎల్.ఏ. మద్రాసు) తలపెట్టిన బిల్లు.

మదరాసు రాష్ట్రములో కళావంతుల సంఘము నందు అవివాహిత స్త్రీలకు నృత్య గీతములు నేర్పి వ్యభిచార వృత్తిని ప్రవేశ పెట్టుట అచారముగా వున్నది గాబట్టిన్నీ, అట్టి స్త్రీలచే జరుపబడు మేళములు ప్రజల నైతిక జీవితమునకు అపాయ కరముగ వున్నది గాబట్టిన్నీ- అట్టి స్త్రీలచే.జరుప బడునృత్య గీతములు మదరాసు రాష్ట్రములో నిషేధించుట అవసరము గాబట్టిన్నీ, యీ క్రింది విధముగా చట్టము, చేయబడినది.

1. ఈచట్టము 1947- మదరాసు కళావంతుల మేళముల నిషేధ చట్టమని పిలువ బడును.

2. ఇది మదరాసు రాష్ట్ర మంతయూ వర్తించును.

3. ఈచట్టములో 1. కళావంతులు అనగా ఆపేరుచే పిలువ బడు హిందూ సంఘమునూ, ఇంకనూ మదరాసు రాష్ట్రములో వివిధ ప్రదేశముల యందు, భోగము, సాని, నాగవాసులు, దేవదాసీలు, కూర్మాపులు అని పిలువ బడు వారున్ను అయివున్నారు.2 మేళము అనగా- కళావంతుల సంఘమునకు చెందిన అవివాహిత స్త్రీ ఒకతేగాని, అంత కంటె ఎక్కువ మందిగాని, ఇతర వ్యక్తులతో కలసి గాని కలవకగాని, దేవాలయ ములలోను, వివాహములలోను, మతసాంఘికములందును, ఊరేగింపులలోను, వ్యక్తుల సమావేశములలోను బహిరంగమైన లేక రహస్యమైనప్రదేశ ములలోను చేయు నృత్యంగాని. గానము గాని లేక రెండును గాని అయివున్నది.

4.(1) ఈ అక్ట 3 వ శెక్షను, 2 డవ సబుసెక్షనులో నిర్వచింప బడిన అన్ని మేళములున్నూ, మదరాసు రాష్ట్రములో చట్టవిరుద్ధములని ఇందు మూలముగా శాసింప బడినది.2 కళావంతుల సంఘమునకు చెందిన అవివాహిత స్త్రీ యీ మేళములో పాల్గొన్నచో, ఆమెకు 16 సంవత్సరములు నిండినచో ఆమెయున్నూ 16 సంవత్సరములు నిండనిచో ఆమె సంరక్షకులున్నూ, ఇంకను ఇటువంటి మేళములు పెట్టుకొన్నటు వంటిగాని, ప్రోత్సహించి నటువంటి గాని, సహాయ పడినటు వంటిగాని, ఏ ఇతర వ్యక్తియును, ఒక సంవత్సరము జైలుకు గాని, రు|| 1000 ల జరిమానాకు గాని లేక రెండు శిక్షలకు గాని, పాల్పడుదురు.

5.(1) 4. వ సెక్షనులో వుదహరింపబడిన నేరము, విచారించుటకుగాని, దానిని గురించి (?) గాని 1898 వ సంవత్సరము క్రిమినల్ ప్రొసీజరుకోడ్ 190 వ సెక్షనులో ఏమి చెప్పబడి వున్నప్పటికీ, మొదటి తరగతి మేజస్ట్రీటుగాని, రాజధాని మేజస్ట్రీటుగాని అధికారము కలిగి వుందురు.

2. ఈ నేరము జరిగినదని చెప్పబడిన తేదీనుడి 6 మాసములు అయిన తరువాత యీ నేరమును గురించి ఎట్టిచర్య తీసుకొన గూడదు.

(3) ఈనేరమునకు జామీను యివ్వ వచ్చునుగాని, రాజీ చేసుకొనుటకు వీలుండదు.

## ఆక్షేపణలు—ఆమోదములు.

(1)

శ్రీమతి ప్రతిపాదింప దలచుకొన్న చట్టము ప్రకారము "మేళము" లన్నియు నిషేధించ బడినవి. మేళము అనగా సదరు చట్టముయొక్క 3. వ సెక్షన్ 2. వ సబు సెక్షనులో "కళావంతుల సంఘమునకు చెందిన అవివాహిత స్త్రీ ఒకతెగాని, అంతకంటె యెక్కువ మందిగాని, ఇతర వ్యక్తులతో కలసిగాని,కలవక గాని, దేవాలయములలోను వివాహములలోను, మతసాంఘికములందును ఊరేగింపుల లోను, వ్యక్తుల సమావేశములలోను, బహిరంగమైన లేక రహస్యమైన ప్రదేశములలోను చేయు నృత్యముగాని గానము గాని, లేక రెండును గాని అయి వున్నది" అని వున్నది. అనగా, యిందు మూలముగా నిషేధించ బడినది, అవివాహిత స్త్రీలచే జరుపబడు నృత్యముగానములే గాని తదితరము లేవియు కాదు గదా! అట్టి నృత్య గానములే ప్రజల నైతిక జీవితమునకు అపాయ కరముగ నున్నవా లేక అపాయకరమగు మార్గములు తదితరములేమైన గలవా? నృత్యగానములే అపాయ కరములైన అవివాహిత స్త్రీలు చేయునవియే యేల? వివాహిత స్త్రీలు చేయునవి యేల కావు?

మానవ నైతిక జీవిత మునకు అపాయకరమగునది "వ్యభిచారము" గాని నృత్య గీతములు గావు. నృత్య గానములు కేవలం కళా సముద్భవంబులు, మానవ మానసోల్లాస దాయకములు, మృదు భావాభి రామ ములు, గాని నృత్యగానములు మానవ నైతిక జీవితా పాయకరము లెన్నటికి గావు; కాజాలవు. అట్టి పరమ పవిత్రమగు సంగీతనృత్యకళలను ప్రదర్శనముల నుండి నిషేధించుటయే గాక రహస్యముగా గూడ ప్రదర్శించుట ప్రభుత్వమువారు నిషేధించినచో కళా నాశన మయి మానవదౌర్భాగ్య మగును గాని మానవ సౌభాగ్య మెన్నటికి చేకూర జాలదు. ప్రభుత్వము వారు మానవ జీవితాపాయకరమగు "వ్యభిచార" వృత్తిని మాన్పిన బాగుగా యుండును. కాని యీ మేళ ముల మాన్పుటయం దేమియు, ప్రయోజనము గన్పట్టదు. మేళములే వ్యభిచార వృత్తికి త్రోవ దీయుచున్నవా? మేళములో కళా ప్రదర్శనము చేసిన స్త్రీతనజీవిత శీలమును కాపాడు కొనుటకు తాను వ్యభిచారము చేయనని అనుకొని నప్పుడు అందలి దోషమేమి? స్త్రీ తన లలిత కళను నల్గురిలో ప్రదర్శించి నపుడు వ్యభిచారము చేయవలెనని నిర్బంధ మెక్కడిది? నిర్బధించినను యిష్టములేని స్త్రీచేత వ్యభిచారము చేయించు టెట్లు? తన యిష్టము లేనిదే యెట్టి స్త్రీయైన వ్యభిచారము చేయునా? వ్యభిచారముచేయు స్త్రీ కళాప్రదర్శనము చేయక పోయినను వ్యభిచారము మానునా?

పాలపర్తి ధర్మరాజుశర్మ.

★ ★ ★

(2)

"భోగం మేళము మీద నిషేధం" అంటే నిరోధించాల్సింది కళావంతులు కాని ఆవర్గమే అనిషేధాన్ని పూర్తిగా బలపరుస్తున్నప్పుడు ఆవర్గానికి సంబంధంలేని ప్రజాభి ప్రాయంతో నిమిత్తమేమి? ఆవర్గ ఆశయానికి భిన్నమైన ప్రజాభిప్రాయం ఆవర్గాన్ని అవమాన పర్చేదిగానే యెంచాల్సి వస్తుంది.

“లలితకళ” అని ఒక చక్రబంధంలో ఒక జాతిని ఇరికించారు వారు. ఈనాడు కళ్ళుతెరచి తమ హీనస్థితిని గమనించి ఆలలితకళ నుండి తప్పుకో దలచారు. ఇప్పుడు మళ్ళీ అయ్యో లలితకళా అని రొమ్ములు చరుచుకోటం వల్ల ప్రయోజనంలేదు. ఆలలితకళాభిమానులు నడుంబిగించండి. తాము నేర్చుకోండి. తమపిల్లలకు భార్యలకు నేర్పి లలితకళారాధన చెయ్యండి. ఆలలితకళ ఎవరు, ఆరాధిస్తేమాత్రం తప్పేముంది. కాని వాళ్ళేవుండాలని వేలం చూపటం మట్టుకు మర్యాదకాదు అని మాత్రమే హెచ్చరిక చేయదలచాను. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు శాసన సభలో ప్రతిపాదింపనున్న భోగంమేళముల నిషేధ చట్టమునకు మా సానుభూతివుంది.”

ఎంపాల వేంకటేశ్వరరావు.

(జన్మభూమి)

★ ★ ★

“నేను ప్రవేశపెట్టిన కళావంతుల భోగము మేళముల నిషేధ చట్టములోని అంశములను ఆధారము చేసుకొని ఒకసమగ్రమైన చట్టమును ప్రభుత్వము వారే ప్రవేశపెట్ట నున్నామని హామీ ఇచ్చినందున నాచట్టాన్ని ప్రతిపాదించకుండా వుపసంహరించు కుంటున్నాను.” అని శ్రీసీతామహాలక్ష్మమ్మగారు జన్మభూమిలో వేశారు.

[ఈ బిల్లును శ్రీ సీతామహాలక్ష్మమ్మగారు ఉపసంహరించుకొన్నను ప్రభుత్వమువారే ప్రవేశపెట్ట బోవుచున్న దేవదాసీ చట్టము సవరణ బిల్లులో నీయంశములను చేర్చనున్నారు కాబట్టి- ఈబిల్లు ఉన్నట్లే. దీనివిషయంలో ఆక్షేపణలూ, ఆమోదములూ రెండున్నూ తీవ్రముగానే యున్నట్లు పైఇరువరి వ్రాతలే తెలుపు తున్నాయి. మాపత్రిక క్రొత్తగా తిరిగీ ప్రారంభింప బడిన దనుట విలేఖరుల కీసమస్య పై మాకు వ్రాయ తగినంత సావకాశము లేనందున ఈసారికి “జన్మభూమి” నుండి యుద్ధరించి పై రెండు లేఖా భాగములు వేసితిమి. అనుకూలురు, ప్రతికూలురు కూడా ఈవిషయమై మాకు క్లుప్తముగా వ్రాసినచో ఇశ్లేప్రచురింతుము. గృ॥ సం॥]






(శ్రీమతి చుండూరి రమాదేవిగారు)

'ఏంచేస్తున్నారండి!'

'రండి కూర్చోండి.'

'ఏమిటిచదువుతున్నారు?'

'భాగవతమండి'

'పిల్లలంతాయేరి?'

'స్కూలుకెళ్లారు.'

'కూరగాయలేమిటి?'

'దోసకాయపప్పు, అరటికాయకూర, చారు.'

'అరటికాయ వేపుడా!'

'కాదండి పులుసువేశాను.'

'ఆకామమ్మగారింట్లో కూరేవండుకోరండి, ఎట్లాతింటారో.'

'... ... ...'

'అయితే యిదివిన్నారా? సీతమ్మగారి అమ్మాయి మొన్న ఆరోజుల్లో కూడా మంచంపుప్పు కొందిట, మేమెరుగం సుమండీ!'

'... ... ...'

'ఈమధ్య మీ ఆడబడుచు వచ్చినట్టుంది, అప్పుడే వెళ్లారేం?'

'ఆయనకు శలవులేదట. అందుచేత వెళ్లారు.'

'అయినా యీకాలంలో నెలల తరబడి పోషించగలమా యేమిటిలే!'

'... ... ...'

'మీపెద్ద మేనకోడలికి పెళ్లయిందా?'

'లేదు.'

'ఇంకా యెప్పుడు చేస్తారమ్మా! నేనాయీడుకి ముగ్గురుబిడ్డల తల్లినయినాను.'

'... ... ...'

'ఆమీనాక్షమ్మగారింటికి వెడతామా, మాటే మాటాడదమ్మా చదువుకుంటూనో, నూలుతీస్తూనో వుంటుంది. అంతగీర్వాణ మేమిటో!'

'... ... ...'

'మీ అత్తగారేది! ఇంటెడు చాకిరీ నీమీద వొదలిపెట్టి యెప్పుడూ తిరుగుతూనే వుంటుందేం?'

'పెద్దవారు, ఏపురాణానికో, హరికథకో వెడుతూంటారు.'

'...          ...          ...'

'అయితే నిన్న మీ ఆయన నీమీద కేకలేస్తున్నాడెందుకూ?'

'పిన్నిగారు, మీరువయసు గడచినవారు, మిమ్మల్నేమీ అనకూడదుకాని, గంటలకొద్దీ ఎందుకీ బాతాఖానీ? ఈ ప్రశ్న పరంపరలవల్ల వచ్చేలాభమేమిటి? మీరు కృష్ణారామ అనుకోరు. నన్ను అనుకోనివ్వరు. నేనేమీ అనలేక మూకీభవంగా వున్నకూడా మీరు గ్రహించరు. మాయింట్లో యేంవండుకుంటే మీకెందుకు? కామమ్మగారింట్లో కూరలేకపోతే మనకేంనష్టం? సీతమ్మగారిపిల్ల మంచం పుచ్చుకుంటె మనకేం? ఈ అప్రస్తుత ప్రసంగంచేసే కాలంలో దేశానికుపకరించే పనేదైనా చెయ్యకూడదూ? నూలు తీయటంకాని, సద్గ్రంథ కాలక్షేపంగాని, పిల్లలకు విద్యాభ్యాసంచేయుటగాని యింట్లోకూడాని చేసేపనులు లక్షున్నాయి. ఆటువంటి దేదైనా చేస్తేచాలా వుపయోగంగా వుంటుంది.

మొన్నమావారు కోపపడిన కారణమడగటం మర్యాద యెరగనిమాట. మీ అయన జీతమెంత? మీరు కట్టుకున్నచీర చాలా బాగుంది. ఖరీదెంతా? మీఅయన నీమీద ప్రేమగా వుంటాడా? ఉంటే నీకుపిల్లలెందుకు పుట్టలేదు? పుడితే ఒక్కడే పుట్టాడేం? చాలామంది పుడితే అంతమంది పుట్టారేం? అంతమందినీ ఎల్లాపోషిస్తారు? కూరలోపులుసు వేసుకోరేం? - ఎందుకొచ్చిన బాతాఖానీ, ఇట్లా వృథాచేసేకాలంలో రాట్నం వడకండి; మీపిల్లల చేతవడికించండి; వార్తా పత్రికలు చదివి ప్రపంచ పరిస్థితులు అవగాహనం చేసుకోండి; అప్పడాలు, వడియాలు, చారుపొడి, సబ్బులు అన్నీయింట్లోతయారు చేసుకోండి; గృహోపకరణమైన సామగ్రులు, గృహాలంకరణకైన లేసులు, చిత్రలేఖనము, హృదయానంద కరమైన సంగీతము, ఆత్మవికాసము కలిగించే సద్గ్రంథ పఠనము ఇటువంటివన్ని జీవితానికి ఉపయోగకరమైనవి. అంతేగాని, పొరుగిళ్ల పెత్తనాల వలన లాభమేమీలేదు. "పగటిపెత్తనం పనికి చేటు; రాత్రిపెత్తనంనిద్రకు చేటు." అన్నారు. పైగా మీనాన్నమ్మగార్కి గర్వమంటున్నారు. ఆమెచాలా వివేకవతి, నిగర్వ చూడామణి. ధనవంతురాలననే గర్వమిసుమంతైనా లేదు. మీస్వభావానికి సరిపడక అట్లాఅభిప్రాయ పడ్డారు. ఇకనుండైనా అనవసరప్రశ్నలతో పరులను విసిగించకండి. ఇల్లాకఠినంగా అన్నానని కోపముంచుకోకండి, ఈ అలవాటు మీకేకాదు. చాలమందికుంది. ఇటువంటివి అమర్యాదను, నాజూకులేమిని సూచిస్తాయి. ఇక వంటవేళైంది, శలవు.'

---

కలియుగమున గుణవతులగు
చెలువలు "గృహలక్ష్మి" సేవఁ జేయుచుఁ దమ పే
రులు కే. యన్. కేసరి వ
ర్యులు వ్రాయఁగఁ దెలియఁ బడుదు రుర్విఁ శుభముగన్.

— తాటిపర్తి వెంకటసుబ్బారావు.

# మహాత్ముని పాదసంచారము.

నౌఆఖలియందు హిందూ ముసల్మానులకు సామరస్యము, పరస్పర విశ్వాసము కుదర్చవలెనని తూర్పుబంగాళమునకు పోయిన గాంధీమహాత్ముడు పాదసంచారమున గ్రామ మొక్కరోజుగా నౌఆఖలి యందు ప్రచారము గావించడానికి ఈ సంవత్సరారంభంలో పూనుకొన్నాడు. 2000సం॥ లకు ముందు బింబిసారుని యజ్ఞమున బలియగుటకై తీసుకొని పోబడుచున్న మేకపిల్లను-నడువలేదని స్వయముగా ఎత్తుకొని వెళ్లి బుద్ధభగవాను డతనికి అహింసాబోధ గావించి దాని ప్రాణములను రక్షించినాడు. షణ్మతముల మూఢ సాంప్రదాయముల చిక్కుకొని నలుగుచున్న హిందూజాతికి, ఆదిశంకరభగవత్పాదులవారు 30 సం॥ ల లోపువయస్సుననే-పాదసంచారియై దేశమంతా సంచరించి విమతస్థులతో వివాదముల గెల్చి అద్వైతామృత మును పంచిపెట్టి వారిని ఉద్ధరించినారు. గురువు పరమరహస్యమన్నా-తిరుమంత్రమును ఆశేషజనానికి గోపురమెక్కి చాటి దేశమంతా పాదసంచారియై బోధించి భక్తిప్రధానమగు వైష్ణవ ప్రపత్తిని ప్రజా సామాన్యానికి పంచిపెట్టి అష్టాదివర్ణములను శ్రీరామానుజులవారు ఉద్ధరించినారు. శ్రీమధ్వాచార్యులు నట్లే ద్వైత సాంప్రదాయమును వెదజల్లినారు. నేడుమహాత్ముడును తనఅహింసావ్రతము ఆచరణసాధ్యమా-యన్న పరీక్షకు నౌఆఖలియందు తాలుచున్నాడు. అందుకై పాదసంచారియై గ్రామగ్రామమునకు పాదరక్షలును లేక పాదములు కంది బొబ్బలెక్క సంచరించుచున్నాడు. దారిలో భక్తిభావమున హిందువులు, ముస్లిములు అనేభేదము లేకుండా స్త్రీలును వారిదర్శన మొనర్చుకొని పవిత్రులమైనామని భావిస్తున్నారు. పూలమాలలతో అలంకరిస్తున్నారు. పాదప్రక్షాళణమొనర్చి పైనజల్లుకొని పునీతులగుచున్నారు. హారతులిచ్చి హర్షిస్తున్నారు. ప్రదీపజ్యోతీహస్తులై ప్రదక్షిణమొనర్చి వినమ్రులౌతున్నారు. వారువారొనర్చుసపర్యల సంతోషపూర్వకంగా స్వీకరించి, ఆశీర్వదించి మెల్లమెల్లగా ఉత్తమ జీవితపథమును బోధిస్తున్నారు. ఒకచో ఒకేచెరువు నీటగుడ్డలుతికి, స్నానంచేసి, పానము చేయకండి. పానోదకానికి చెరువు విడిగా ఉంచుకోండి, అని బోధించినారు. మరొకచో అంధురాలు ముదుసలి యొక్కతె "ఎదుట ఉన్న నిన్నుచూడని బ్రతుకెందుకు" అంటే "చర్మచక్షువులతో చూచేది అశాశ్వతం; జ్ఞానచక్షువుతో చూచేదే శాశ్వతం" అని గాంధీజీ జబాబు. ఒకగ్రామంలో పున్నమవచ్చింది. మూడునెలలనాడు సత్యనారాయణ వ్రతమును విరమించిన స్త్రీలంతా తిరిగీ ఆరోజున ఆవ్రతంచేసుకొని ఉళుధ్వని సల్పినారు. మరోగ్రామంలో కొడుకును భర్తను తనకండ్ల ఎదుటనే దుండగీండ్రు హత్యచేస్తే గుండెబద్దలై చనిపోయిన ముదుసలి ముత్తైదువు ఒలికి చూపించినా రాయనకు. ఇంకోగ్రామంలో, గ్రామంలో ఉన్నస్త్రీలందరిని జమీందారు భవనంలో చేర్చిగ్రామస్థులు చుట్టుగుడిశలలో నిల్చిసాయుధులై రక్షించినవార్తలు వినిపులకాంకితుడైనాడు. మరోగ్రామంలో కొందరు బాలురను వెంటబెట్టుకొని తాము గ్రామం పరిశుభ్రంచేస్తూ ఊసుపోకకు 'రామధ్వని' చేస్తుంటే ముసల్మానులు వచ్చి బెదిరించారనీ, "చంపండి" అనిదరికి పోగానే వారుమెత్తపడి తమదారిని పోయారని డా. సుశీలానాయర్ చెప్పినగాధ చెవియొగ్గి ఆలకించి తలపంకించినాడు. వేరొకచో గ్రామం ప్రక్కన

చిన్నబిడ్డలు మహాత్మునికి పూలసెజ్జ నేర్పాటుచేసి కొంచం విశ్రాంతిగొని తమముద్దుచెల్లించమన్నారు. ఆఁ! ఈముసలాయన కెక్కడలేని తొందర; వ్యవధిలేదన్నాడు. కాని కాస్సేపు నిలవండి; అనివేడినీళ్లు పెట్టి కాళ్లు కడిగి ఒకపండిచ్చి పంపినారు. మరొక గ్రామంలో పురుషుల ద్వారా కబురంపి ముసల్మాన్ స్త్రీలు వారిదర్శనం చేశారు. పరదాపద్ధతి విడిచిపెట్టండి అని నిర్మొగమాటంగా వారికి బోధించినాడు.

## శ్రీమతి అంతస్ సలాం కన్య

ఈ సంచారంలో ఇనొక ఘట్టం. శ్రీమతి అంతస్ సలాంకన్య పవిత్రమైనవ్యక్తి. పెద్ద కుటుంబానికి చెందిన ముసల్మాన్ యువతి. చిర కాలంక్రిందట మహాత్ముని శిష్యకోటిలో చేరి, ఆయన ఆశ్రమవాసియై ఉత్తమ జీవిక సాధన ప్రారంభించినది. ఖురానేషెరిఫ్ గ్రంధము, గీతాపుస్తకము నిరంతరం వెంట ఉండ వలసినదే. రెంటినీ సమభక్తితో చదివి అన్వయం చేసుకుంటుంది. ఖురాన్ చెప్పినట్లు అక్షరాలా నడుచు కుంటుంది. గీతాప్రబోధిత కర్మయోగము దానికంటే వేరుగాదని గ్రహించింది. రంజాన్ పండుగను యథావిధిగా జరుపుతుంది. ఆమెకూడా నేడు నౌఆఖలికి మహాత్మునితోపాటు వచ్చినది. మహాత్ముడు తనబృందాన్ని చెదిరిపోయి తలా ఒకగ్రామాన్ని అంటి పెట్టుకొని పనిచేయమనగానే ఆమె రాజారాంపురం ప్రవేశించింది. ఆకార్యక్రమం సందర్భంలో ఒక విచిత్రసంఘటన ఏర్పడినది. ఆగ్రామంలో ఒక వ్యవసాయదారుడైన హిందువునింట పనిముట్లన్నిటిని దోచివేశారు. వాటితోపాటు ఆఇంటి వారు ఇలవేల్పుగాపూజించే "ఖడ్గము" నొకదానిని కూడా మయల పరచి పట్టుకొని వెళ్లారు. దాన్ని చేబూని ఒక ముసల్మానుడు కొందరిని గ్రామస్థులను నరికి వేశాడు; అతడు దానినెక్కడ దాచాడో, పారేశాడో? పరారి అయినాడు; పట్టుపడలేదు. ఆఇంటివారు తరతరాలుగా తమవంశంవారిచేత పూజలు గొంటూ ఒక చుక్కైనా రక్తం రుచిచూడని ఆ పవిత్రఖడ్గం ఆవిధంగా అపవిత్రం కావడం, అంతర్థానం కావడం సహించ లేకున్నారు. దానిని తిరిగీ వారికి చెందచేయుమని సలాంకన్య కోరినది. జరగలేదు. ఖడ్గం హింసా సాధన మని సాకులు చెప్పారు. హిందువుల పూజాస్వాతంత్ర్యం సాధించవలెనని ఆమెకు తోచినది. ప్రాయోపవేశం చేయ నారంభించినది. 104 డిగ్రీల జ్వరం; నోరుమూత పడకుండా దగ్గు; 12 రోజులు ఆదగ్గు ఆబిడ్డను ఊపేసింది. కాని సలాంకన్య చలించలేదు. క్రమంగా శరీరం శుష్కించింది. ఓపిక ఉడిగింది; నీరసం హెచ్చింది. అవసానదశ ఆసన్నమైంది. పరిచర్యలు చేస్తున్న డా. సుశీలా నయర్ ధైర్యము క్రమంగా సన్నగిల్లింది. 23, 24 రోజులు గడిచేసరికి ఆమె పెదవులు విరిచి, చేతులు వెల్లకిల వేసింది. బాపూను వక్కసారి వచ్చిచూచిపొమ్మని కబురంపినది. మహాత్ముడు క్రమంతప్పక తన సంచారం సాగించు కుంటూ సలాం ఉన్న గ్రామం వైపే వస్తున్నాడు. దారిలోనుంచీ వకసారి-"ప్రారంభిచావు; మానకు" అని హెచ్చరిక పంపినాడు. "ఫర్వాలేదు, కావలెనంటే వచ్చిచూచి పొండి." అని ఆమె అన్నదమ్ములకు కబురంపినాడు. కాని రోజు రోజూ ఆయన దగ్గిర పడుతుంటే, రోజు రోజూ ఆమె స్థితి నీరసిస్తున్నది. ఆయన ప్రక్క గ్రామానికి వచ్చేసరికి ఆమెస్థితి బాగా నీరసించింది. సుశీలా నయర్ ఆశవదులుకున్నది. ఆసంగతి తెలిసి మహాత్ముడును మానంవహించి తపించనారంభించినాడు. ఆసాయంకాలం ప్రార్థన సభలో ఆమె చరిత్ర వివరించి "పవిత్రాత్మ; హిందూ ముసల్మాన్ సఖ్యతకై

ఆమె యమలోకానికి యాత్ర వెళ్లుచున్నది" అని వ్రాసి చదివించాడు. మరునాడును మౌనవ్రతములోనే వచ్చినాడు. ఆమె ప్రక్క వద్ద నిలిచినాడు. మౌనవ్రతుడైన మహాత్ముడు; మాట్లాడజాలని సలాం; మౌన వ్యాఖ్యానమున వారేమి చర్చించుకొన్నారో? మూగభాషలో వారేమి మాట్లాడుకొన్నారో? ఓపిక ఉడిగిన ఆమె 25 రోజుల నుంచీ తమ గ్రామంలో ప్రాయోపవేశవ్రతనిష్ఠాగరిష్ఠయై నిజప్రాణమధుపములను ఈశ్వర పాదారవిందముల కర్పించి సంతత శాంతినిలయమై, ఖురానె షెరీఫ్ పీయూషమును, గీతామృతమును రెండు చెవుల తనివారగ్రోలుచు తపమొనర్చుచున్న పవిత్రమూర్తి; కొడిగట్టని దివ్యజ్యోతి; మసివిడువని సాంబ్రాణి కడ్డీ. ముసల్మానుల హృదయాంతరాళముల నున్న అల్లా కళవిళ పడ్డాడు. పైగంబర్లు సైగలు చేశారు. వారినాయకులు మహాత్ముని వద్దకు రాయబారం వచ్చినారు. ఖడ్గం తిరిగీ లభ్యం కావడం నిమిత్తమాత్రం; న్యూనసంఖ్యాకుల పూజా స్వాతంత్ర్యానికి అధిక సంఖ్యాకు లిచ్చే సంరక్షణానికి అది చిహ్నంమాత్రమే. కావలసినది, అలాంటి హృదయపరివర్తనమే. వల్లె అన్నారు, ముసల్మాను నాయకులు. 17 గురు పెద్దలు వ్రాతమూలకంగా ఆపరిసరగ్రామాలలో అట్టిస్వాతంత్ర్యము కాపాడుతామని వాగ్దత్తంచేశారు. ఆవాగ్దానం తప్పితే అపరాధపు మరతుకూడా—అహింసా పూర్వకమే-మహాత్ముడే ప్రాయోపవేశం చేశేటట్లు. ముసల్మానులు ముందు ఈమరతునకు చకితులైనారు. పిదప సమ్మతించారు. ఆసాయంకాలం, 25 వ నాడు, సుశీలా, ఆభా గాంధీ, ఆపడుచు లిద్దరూ, ప్రక్కమీదనే ఆమెనెత్తి పట్టుకున్నారు. అనేక ప్రాయోపవేశములొనర్చి, బ్రతికి బట్ట కట్టుతున్న మహాత్ముడు, వృద్ధాప్యమున వణుకుతున్న చేతితో దృఢముగా పట్టుకొన్న గ్లాసుతో ఫలరసము నందించినాడు. ఆర్చుకుంటూ, ఆర్చుకుంటూ నాలుగు గరిటెలు ఆరసం చప్పరించి, సలాం పెదవులు తడుపుకొన్నది. చుట్టు మూగియున్న హిందూముస్లింనాయకులు స్వస్థచిత్తులైనారు. మహాత్ముడును పదిలహృదయుడై "ఈబాల జీవించినా, మరణించినా హిందూముస్లింసఖ్యతకే" అంటూ తృప్తితో నిట్టూర్పు పుచ్చాడు. అదే ఆశీర్వచనంకూడా. అంతటితో పంచభూతములు శాంతించినవి. ధన్యజీవిగదా, అంత స్సలాంకన్య!

—— (0) ——

కొబ్బరి, కొబ్బరికాయ, కొబ్బరినూనె కంట్రోలు ధరలు.

| | దక్షిణకన్నడ, మలబారుజిల్లాలలో | ఇతరజిల్లాలలో |
|---|---|---|
| కొబ్బరి వీశ 1 కి | రు॥ 1-5-1 లు | రు॥ 1-6-5 లు |
| కొబ్బరికాయ 1 కి | రు॥ 0-2-3 లు | రు॥ 0-3-0 లు |
| కొబ్బరినూనె వీశ 1 కి | రు॥ 2-3-3 లు | రు॥ 2-7-0 లు |

——:o:——



కస్తూరిబా తృతీయ శ్రాద్ధమును గాంధీ నౌఖాలీలో
19-2-47 ప్రశాంతంగా జరిపినారు.

మూడేండ్ల నాడు ఆగాఖాన్ భవన ప్రాంతంలో కస్తూరిబా గాంధీ శవాన్ని దహనం చేసిన తర్వాత చితిచూస్తూ అచంచలుడైయున్న గాంధీని కుమారుడు దేవదాసు గాంధీ "ఇంట్లోకి వెళ్దాము, రాండి బాపూ." అని పిలిచాడు.

"60 సం॥ లు నీసహచర్యం చేస్తినే, ఈ నిమిషాలలో మరిచిపోవాలా అనదా మా అమ్మ" అని కరుణారసము ఉలికేట్లు అన్నాడు గాంధీ

నేడు తిరిగీ, శ్రాద్ధానంతరం, "కస్తూరిబా మనల విడిచిపోయి మూడేండ్లైనది గదా" అని ఆయన అన్నారు.

గాంధీ జీవితంలో చాలా దీర్ఘకాలం కాబోలు, ఈ మూడేండ్లు!

# బ్రతుకు తెరువు

## వాసన తలనూనెలు

తలవెండ్రుకలు పెరుగుటకు, పట్టుకుచ్చువలె మృదువగుటకు మంచి సువాసన తైలములు ఆవశ్యకములు. తలకు చమురులేకుండిన వెంట్రుకలు పొడవుగ పెరుగకుండుటయే గాక తలబిరుసెక్కి చుండు, పేలు మొదలగునవి సంభవించును. తలకు రాచుకొను తైలములలో క్రొవ్వు పదార్థము లుండవలయును. ముఖ్యముగా స్త్రీలకు మంచి సువాసనగల సబ్బు ఎంత ఆవశ్యకమో సువాసనగల తలనూనెలుకూడ అంత ఆవశ్యకములు. మంచితైలములతో శరీరమును మృదువుగ మర్దించుకొనిన చర్మము మృదువగుటయేగాక అందముగూడ నిచ్చును. యంత్రములు చక్కగా పనిచేయుటకు చమురు యెంత ఆవశ్యకమో మనుష్య యంత్రమునకుకూడ చమురు అంత ఆవశ్యకము. శరీరమునకు పట్టించుకొను తైలములను చర్మము పీల్చుకొని, చర్మవ్యాధులు రాకుండా చేయును. ముఖ్యముగా హిందూదేశమున చమురు రాచుకొని స్నానము చేయుట ఆవశ్యకము.

కేరళదేశపు స్త్రీలు, బర్మాదేశపు స్త్రీలు విరివిగ కొబ్బరినూనెను ఉపయోగ పరచి చన్నీటిలో స్నానము చేయుట వలననే వారి తలవెంట్రుకలు మడిమలు తాకు చుండును. తలనూనెలవలన మెదడు చల్లపడి బుద్ధికుశలతకూడ కలుగును.

పరదేశములనుండి వచ్చు సువాసన తలనూనెలను మనదేశమువారు కోట్లకొలది ధనమును ఖర్చుపెట్టి వాడుచున్నారు. కలకత్తాలో అనేకులు సువాసన తలనూనెలను తయారు చేసి లక్షలాదులు ఆర్జించి ధనికులైయున్నారు. ఇప్పుడు మనదేశములో కూడా ధనికులు, దరిద్రులుకూడ సువాసన తలనూనెలకు అలవాటుపడి యున్నారు. అమెరికా దేశములో జపానుదేశములో సువాసన ద్రవ్యములను తయారుచేయువారు నూటికి తొంభైమంది స్త్రీలు. ఈచిన్న పరిశ్రమలు తయారుచేయుటకు గొప్పచదువు అక్కర లేదు. గనుక మనదేశములోకూడ ప్రతివారును తలనూనెలను తయారుచేసి ధనార్జన చేయవచ్చును.

తలనూనెలను తయారు చేయుటకు కొబ్బరినూనె, నువ్వులనూనె, ఆముదము, బాదమినూనె మొదలయినవి మంచివి. కొందరు తెల్లచమురు (White oil) చౌక

అగుటచేత దీనితో తయారు చేసి విక్రయించుచున్నారు. తెల్లచమురు అనగా వాసన తీసివేసిన కిరసనాయిలు. ఇదిభూమినుండి తీయబడినది. ఇది తరచు రాచుకొనిన మెదడు నకుచెరుపు జేయుటయేగాక వెంట్రుకలు ఎఱ్ఱబడును; లేక తెల్లబడును. గనుక దీనిని యెవ్వడున్నూ వాడకూడదు. బాదమివిత్తులనూనె చాలావెలగలది. గనుక చాలా ధనికులు వాడవచ్చునుగాని సామాన్యులు వాడుకొనుటకు వీలుకాదు. కొబ్బరినూనెతో తయారు చేయబడిన తలనూనెలు చలికాలములో నెయ్యివలె గడ్డకట్టుకొనును. అందువలన సగము కొబ్బరినూనె, సగము నువ్వులనూనె సమానముగా కల్పి తలనూనెలు తయారు చేసుకొనుట మంచిది. తలనూనెలను తయారు చేసుకొనుటకుముందు నూనెలో సాంబ్రాణి కలిపి కాచి వడియగట్టినపిమ్మట యిష్టమువచ్చిన అత్తరును కలిపి వాడుకొనవలెను. నూనెలో సాంబ్రాణి కలుపుటవలన వెండ్రుకలు పిసకపట్టవు. ఈదిగువన కొన్ని తలనూనె యోగ ములను వ్రాయుచున్నాము. గనుక వాటిని తయారు చేసుకొనవచ్చును. నూనెలో సాంబ్రాణి, (వీశెనూనెకు రెండు తులములు సాంబ్రాణి) చేర్చి, తెర్లుచుండు వేడినీటిలో పెట్టి సుమారు మూడు ఘంటలకాలము కాచవలెను. పొయ్యిమీద పెట్టి కాచ కూడదు. అనగా వెడల్పాటి పాత్రను పొయ్యిమీద పెట్టి కొద్దిగ నీళ్లుపోసి నూనెపోసిన పాత్రను ఆనీటిపాత్రలో పెట్టి కాచి ఒడియకట్టవలెను. ఇట్లు కాచిన నూనెను సాంబ్రాణి నూనెయని చెప్పెదరు.

వాసన తీసివేసిన తెల్లటి ఆముదముతోకూడ తలనూనెలను తయారు చేసెదరు. ఈచమురు చిక్కగా నుండుటవలన చాలమంది వాడరు. ఆముదముతో తయారుచేసిన తైలములవలన వెంట్రుకలు త్వరగా పెరుగుటయేగాక తలరేగదు. మృదువుగా యుండి మెరుగు నిచ్చును. అయితే కొబ్బరినూనె నువ్వులనూనెతోకూడ ఆముదమును కలిపి తయారు చేసుకొనవచ్చును. దీనిని వాడుట వలన తల బట్టతలకాకుండును.

ఈతలనూనెలకు వాడుకొను తైలములు శుద్ధిచేసినవే వాడవలెను. అనగా యిప్పుడు యంత్రములవలన ప్రతి చమురులో యుండు వాసనను తీసివేసి తెల్లగానుండునట్లు చేయుదురు. అటువంటివి స్వస్తిక్ కంపెనివారు తయారు చేయుచున్నారు. తలనూనెలలో కొన్ని రంగులను కలిపి విక్రయించుచున్నారు. రంగులనూనె తలకు అంత మంచిది కాదు. తెల్లటి నూనెయే మంచిది.

రోజాతలనూనె

| | | |
|---|---|---|
| తెల్లనువ్వులనూనె (పప్పునూనె) | 72 | తులములు |
| కొబ్బరినూనె (శుద్ధిచేసినది) | 72 | ” |
| తెల్ల ఆముదము (శుద్ధిచేసినది) | 72 | ” |
| రోజా అత్తరు (Otto Rose) | 1 | ” |
| లవండర్ అత్తరు (Oil of Lavendar) | 8 | డ్రాములు. |
| చందన అత్తరు (Sandalwood oil) | 2 | ” |

మొదటి మూడుచమురులను ఏకముచేసి బాగాకలియునట్లు గరిటతో కలిపి పిమ్మట చందనఅత్తరును కలపవలెను. తరువాత రోజా అత్తరును, లవండర్ అత్తరును కలపవలయును. అన్నియు బాగా కలిసిన పిమ్మట గట్టిగా గాలిపోకుండా మూతపెట్టి ఒక దినమైన పిమ్మట బుడ్లలోపోసి కార్కు వేసి వాడుకొనవలెను. అప్పుడప్పుడు బుడ్లను కుదిలించుచుండిన మంచిది.

తాంబూల బీహార్ (తాంబూలమాత్రలు)

| | | |
|---|---|---|
| అతిమధురపాలు | 24 | తులములు |
| మొగలిపూలలోని పొడి | 24 | ” |
| ఏలకులు | 3 | ” |
| చలవ మిరియాలు | 3 | ” |
| లవంగాలు | 3 | ” |
| లవంగపట్ట | 3 | ” |
| కుంకుమపువ్వు | 3 | ” |

పై వస్తువులన్నియు మెత్తగపొడిచేసి రాతికల్వములోవేసి కావలసినంత పన్నీరును వేసి కలిపి ఒకరాత్రి అంతయు వూరనిచ్చి రాతితో మెత్తగనూరవలయును. అప్పుడప్పుడు పక్వమగుటకు పన్నీరువేయుచు నూరవలెను. మందు కల్వమునకు కరుచుకోకుండునట్లు మగినమువలె నూరవలెను. కడపట మంచి రోజాఅత్తరును (Otto Rose) 20 చుక్కలను వేసికలియ నూరి మినప గింజల ప్రమాణము మాత్రలుచేసి నీడన ఆరబెట్టి బుడ్డిలోవేసి వాడుకొనవలయును. ఇందువలన నోరు పరిమళముగ నుండును. దంతములకు మంచిది.

వచ్చేసంచికలో మహారాజులు ఉపయోగించే (Sen Sen) సెన్ సెన్ అనే తాంబూలమాత్రలను గూర్చి వ్రాయబడును.

# ఇంటిపనులలో మెలకువలు.
## DOMESTIC ECONOMY FOR WOMEN



### వంటఇల్లు — పాత్రలశుభ్రత

ఆహారపానీయములు తయారొనర్చునట్టి వంటఇల్లు చాలినంత విశాలముగను, వెలుతురు తోటినిండి యుండునట్లును పొయ్యియొక్కపొగ ధారాళముగ ఎగిసి పోవు సదుపాయములతో యుండవలెను. వంట ఇంటిలో పాత్రలుమొదలగు సామానులు పరిశుభ్రముగా నుంచుకొనతగిన (Shelves) అరమరలు యుండుట మంచిది.

శుభ్రమయిన జలముండునట్లు యేర్పాటు చేసుకొనుట కూడ అత్యవసరము. నీటితోనింపిన పాత్రకు సరియైన మూతయుండుటయు, అవిపరిశుభ్రముగా నుండుటయు జాగ్రత్త వహించిచూడవలయును.

బట్టలను పరిశుభ్రమొనర్చుటకు ఉపయోగించు పాత్రలను వంట పనుల నిమిత్తము యేమాత్రము ఉపయోగించరాదు. వంటపాత్రలను వంటపనుల నిమిత్తము ఉపయోగించుటకు ముందును, ఆవలను కూడ శుభ్రమొనర్చ వలయును.

మురికి గుడ్డలను యెన్నడును పరిశుభ్రత యొనర్చు పనులకు ఉపయోగింపకూడదు కడు అపాయకరము. అట్టి మురికిగుడ్డలు సామాన్యముగ అంటు వ్యాధులకు మూలమగును. గనుక ఆట్టిగుడ్డలను శుభ్రముగా నుంచుట మంచిది.

కూరగాయలు:-సామాన్యముగా, తోటకూర, బచ్చలికూర, గోంగూర, మొదలగు ఆకు కూరలపయినను, తదితర కూరగాయలపైనను, క్రిమి సముదాయములు, వాటిగ్రుడ్లు మొదలగునవి అంటుకొని యుండును. అట్టివి అంటుజాడ్యము లంకురించుటకు ప్రాధాన్యము లగును. కావున వండుటకు ముందు కూరకాయలను పరిశుభ్రముగా కడుగవలయును. గడ్డ దుంపకూరలను మాత్రము మొదట గట్టిగారుద్ది తదుపరి శుభ్రముచేయవలెను. ఆకుకూరలయందుగల చెడిపోయిన భాగములను విసర్జించి కొంచెము ఉప్పువేసి కడిగిన పిదప వాడుట మంచిది. కొన్నికూరలను తరిగి, కొన్నిటిని పైనిచెక్కుతీసి, వాడుకొనుచుండవలయును.

అన్నము వండుటకు దంపుడు బియ్యము కడు శ్రేష్టమనియు ఆరోగ్యకరమనియు అందరకు తెలిసిన విషయమే. అన్నము వండుటకు ముందు బియ్యమును శుభ్రముగా

కడిగి అందుండు పొట్టు, మట్టి మొదలగు అపరిశుభ్రమయిన వాటిని పోగొట్టిన పిదప వండుట మంచిది.

బట్టలుఉదుకుట:- బట్టలు పలుపర్యాయములు శుభ్రము చేయక మార్పుచేయక యెల్లపుడు మురికి బట్టలను ధరించరాదు. శరీరము నందుండు మాలిన్యము గాలిలోని దుమ్ము బట్టలకు అంటుకొనుట వల్లనే సహించని దుర్వాసన వచ్చుచుండును. శరీరారోగ్యము నిమిత్తము బట్టలను పరిశుభ్రముగా నుంచుకొనుటయేమంచిది.
బట్టలను శుభ్రపరచిన తర్వాత మంచి ఎండలో ఎండ వేయవలయును. పెట్టెలయందుంచిన దుస్తులను అప్పు డప్పుడు తీసి ఎండ వేయుట మంచిది. అట్లుచేయని యెడల బట్టలకు పురుగు జట్టి, చిల్లులుపడి చెడిపోవుచుండును. మరియు పరుపులు, దిండ్లు, దుప్పట్లు మొదలగుపక్క (Bedding) లకు ఉపయోగించు బట్టలను ప్రతిరోజు జాగ్రత్తగ చూచు కొనుచుండ వలయును. మరియు వ్యాధిగ్రస్తుల ఉడుపులు, పక్కబట్టలు అతిజాగ్రత్తగ యెండలో వేయుచూ శుభ్రముగ నుంచవలయును. లేనిచో పెక్కు అంటువ్యాధులను తమంతట తామే తెచ్చుకొనిన వారగుదురు. ఎండ వేడిమిచే క్రిమి సంహారమై ఆరోగ్యయుక్తముగ నుండును.

శిశుపోషణ:- సామాన్యముగా శిశువులు తమనిత్య కృత్యములను తాము స్వయ ముగాచూచు కొనలేరుగాన తలిదండ్రులు అతిజాగరూకులై గమనించు చుండవలయును. రోజునకు వక పరియాయము స్నానము అవసరము. పసిబిడ్డలకు త్వరలో జలుబు పడిశెము దగ్గురాగలవుగాన ఉష్ణోదకస్నానమే అవసరము. వారిశరీరములు అతికోమలములై, మృదువైయుండునుగాన సబ్బులనువాడరాదు. సువాసనలతోచేసిన పెసరపిండిగాని మినప పిండిగాని వాడుకొనవచ్చును, స్నానానంతరము మెత్తని (Towel) తువ్వాలతో తుడువ వలయును. పసిపిల్లలకు చల్లని హాయినిచ్చు ప్రదేశములలో నుంచిన పలుమారు జలుబు పడిశెము పట్టకుండుటయేగాక గ్రహబాధలు కూడ తొలగిపోవును.

చర్మమును, చలి, ఎండదుమ్ము మొదలగువాటికి గురిచేయక స్నానమునకుముందు ఆముదమునుగాని, కొబ్బరినూనెనుగాని, రాయుట మంచిది. అట్లురాయుటవలన చర్మ

వ్యాధులు అంటనేరవు. బట్టలు మాసి, దుమ్ము పట్టినట్లుండినవెంటనే శుభ్రమైన బట్టలను మార్చుచేయు చుండవలయును.

<u>బిడ్డల ఆహారము</u>:-సామాన్యముగా బిడ్డలు జీర్ణింపచేసుకొనదగిన ఆహార సదుపాయములను పాలించక పోవుటవల్లనే చాలా వ్యాధులు కల్గుచున్నవి. ఆహారమును నిర్ణయించుటలో, తయారుచేయుటలో కడుశ్రద్ధవహించవలసి యున్నది. సంవత్సరము లోప్రాయముగల శిశువులకు తల్లిపాలే అవసరము, మంచిదికూడాను. పసిబిడ్డలకు తల్లిపాలవలె ఆవుపాలుకూడా కొన్నివిధముల మంచిదియే. ఆవుపాలయందు కొవ్వు నిచ్చు పదార్థమును, తీపిదనమును తగినట్లుయుండును. మూడుమాసముల శిశువునకు కృత్రిమ ఆహారము యివ్వ వలయునన్న వకఔన్సు మీగడలో వకఔన్సుపాలు, మూడు ఔన్సులు నీళ్లు, తగినంత చక్కెరగాని (Glucose) గ్లూకోసుగాని చేర్చియివ్వవచ్చును. డబ్బాపాలు సందర్భానుసారముగ వాడవచ్చును. మెలిన్సు, హార్లిక్సు, నెజిల్స్ మొదలగునవి వాడనగును. 5 సంవత్సరముల ప్రాయము వరకు, పాలు యిచ్చుటయే శ్రేష్టము. పిమ్మట అన్నము పాలు, రొట్టె మొదలగునవి యివ్వ వచ్చును. బిడ్డలు అనారోగ్యవంతులు కాకుండుటకు వారి ఆహార, విహార, నిద్రావస్థలయందును స్నానపానాదులమర్చుటలోను, ఉడుపులుధరింప జేయుటలోను సంపూర్ణమయిన విజ్ఞాన సంపత్తితోకూడు కున్న అనుభవ ముతో వారికి ప్రతిదినము ఆరోగ్య విధులను చక్కగా నేర్పించు చుండుటయే గృహలక్ష్మి కనుకూలమయిన దినచర్య అని అందరును తెలుసు కొని నిత్యాచరణలో తప్పక పెట్టుదురని కోరుచున్నాను.

——(o)——

అ తి థి పూ జ.

జోరున వర్షముల్ గురియు సువ్రితుఁ డాచిఱుతొండనంబి దై  
వాఱడుభక్తిపెట్టు శివభక్తుల కర్థి జతుర్విధాన్నముల్  
తారనియొల్పఁబప్పును ఘృతంబును దియ్యనిపాయసంబులుం  
జాఱులుఁ బిండివంటలును శర్కరయుక్ దధియుక్ యథేచ్ఛఁగన్.

— హరవిలాసం.

—:o:—




## పొంగురొట్టె

హిందీలో దీనిని, ' సుఖా రోటీ, ' అందురు. అర్ధశేరు గోధుమలు విసిరినపిండిని గట్టిగా నీటితో కలిపి, పోయుటకు ఒకగంటముందుగా కలిపి యుంచుకొని, పోయునప్పుడు బాగుగా మర్దించవలెను. కణకణలాడు నిప్పును సిధ్ధముగా నుంచుకొని, పొయ్యిపైన పెనమువేసి పొయ్యిముందు నిప్పుంచవలెను. పెనమునకు చిన్నమంటయుండవలెను. కొంచెము దళముగారొట్టెను,వరిపిండి మెదిపి వత్తి,మొదట పెనముపై వేయగా కొద్దిగ తడియారిన తరువాత, నిప్పుపైవేయువలెను. అదిబాగుగా పొంగును, వెంటనే తీసి గిన్నెలోపెట్టి మూతపెట్టిన యడల మెత్తగానుండును. నిప్పుపైగాని, పెనముపైగాని, మిక్కిలిగా కాల్చిన యెడల గట్టిపడిపోయి తినుటకు కష్టముగా నుండును. ధనమున్నవారు ఆరొట్టెలకు నెయ్యి పూయవచ్చును. లేకున్ననూ రుచికి లోపముండదు. దీనిని ఇష్టమైన కూరతోగాని, మసాల పప్పుతోగాని, భుజించిన రుచికరముగా నుండును, ఈరొట్టెను, ఈ హిందూస్థాన రాజ్యమున లక్షాధికారి మొదలు భిక్షాధికారి వరకూ దీనినే ముఖ్యాహారముగా వాడుచున్నారు. పొరలువైచి నేతితో కాల్చిన రొట్టెకంటె ఇదిసులభముగా జీర్ణమగును. తేలికైన ఆహారము, జ్వరము వచ్చినప్పుడుకూడ తినుచుందురు. ఇచ్చటి వారికి, కల్లురొట్టె (బ్రెడ్) తెలియనే తెలియదు. చలికాలములో వర్షాకాలములో భుజించుటకు హాయిగా నుండును. ఒకపావుశేరు పిండిని 5 రొట్టెలంగజానెడు కైవారముతో చేసినమంచిది.

కత్రి కమలమ్మ.

## కందిపప్పు పచ్చడి

తెలుగువారి భోజనమునకు ముఖ్యమైనది కందిపప్పుపచ్చడి. దీనినితయారుచేయుట అమితమైన సులభము అని అనుకొన్నను అందరును దానిని పక్వమెరిగి తయారుచేయుటలేదు. కందిపప్పు మాడుటయో, పక్వముగ వేగకుండుటయో, లేక మిరపకాయలు మాడుటయో, ఉప్పుజాస్తితక్కువలగుటయో, సంభవించును. కొందరు కాటుకవలె నూరుదురు. మరికొందరు వక్కాముక్కగ నూరెదరు. కందిపప్పు పచ్చడికి నెల్లూరు ప్రసిద్ధి అని వింటాము. మాయింటికి నెల్లూరినుండి గుంటూరునుండి బెజవాడ, వంగవోలుల నుండి బంధువులు వచ్చినప్పుడు వారిని కందిపచ్చడిని నూరుమని మేము కోరుతుంటాము; కానివారు యెవరునూరినను మాయింటిలో

నూరినట్లు నూరలేరు. మాయింటిలో నూరుపద్ధతి ప్రశస్తమైనదని అనుభవ పూర్వకముగ తెలిసియున్నది. గావున ఇల్లాండ్రకు తెలియగలందులకు వ్రాయుచున్నాను.

## మాయింటిలో కందిపచ్చడి చేయుపద్ధతి:-

మొలక కందిపప్పును కావలసినన్ని తీసుకొని, ముందుగా రాళ్లు, నలకలు, ఇతరగింజలు - ఏరిపారవేయ వలయును. అంతట పొయ్యిని వెలుతురుండు స్థలమున పెట్టుకొని ఆపొయ్యిమీద బాణలిపెట్టి దానిలో కొద్దిగనేతిని ఉంచి, పప్పునకు కావలసినన్ని యెండు మిరపకాయలను ఆనేతిలో వేసివేయించ వలయును. ఆమిరపకాయల యెరుపురంగు మారకముందే దానితోపాటే కందిపప్పును బాణలిలోపోసి-రెంటిని కలిపి వేయించవలయును. పప్పు పక్వముగ వేగినప్పుడు కమ్మటివాసన వచ్చును; కందిపప్పు గర్భములో తెల్లనిచుక్క కన్పించును. అప్పుడు బాణలిని దించి క్రిందబెట్టి చల్లారిన పిదప ఉప్పువేసి నూరవలయును. నూరిన పచ్చడి యర్ధభాగమువుగను బరకగాను ఉండవలయును. గట్టిగనూరిన భోజన సమయమునకు పొడిపొడిగ ఆయిపోవును. కనుక కొద్దిపల్చగనుండిన నీరుపీల్చుకొని పక్వముగనుండును.

కందిపప్పు పచ్చడితో కొందరు చింతపండును ఇంగువను, కొబ్బెరను, జీలకఱ్ఱ మొదలగు వస్తువులను చేర్చినూరెదరు. కాని అట్లుచేయుట వలన అసలు పచ్చడి రుచి పోవును.

మాధవి.

('లోకోభిన్నరుచిః' అన్నారు. తమకు తమకు రుచికరముగా నుండు పద్ధతులు ఇతరులు వ్రాయ వచ్చును. అనేక రకమైన పచ్చళ్లను గూర్చి ఇంకను ప్రకటింప దలంచితిమి. గృ॥ సం॥.)

## గోధుమ గవ్వలు.

గోధుమలతో తయారు చేయబడిన మెత్తని పిండిని నీటితో కొంచెము గట్టిగానుండునట్లు కలుపవలయును. తరువాత గచ్చకాయలంత ఉండలుగా చేయవలయును. ఆవుండలను మరచెంబు అంచుమీద పెట్టినొక్కి, రెండవ కొసనుంచి తేల్చి తీయవలయును. అప్పుడది గవ్వవలెనగును. దానిని నేతిలోగాని, నూనెలోగాని, వేయించ వలయును. అట్లువేగిన వాటిని పంచదార పాకములోగాని, బెల్లపు పాకములోగాని వేయవలయును. ఈవిధముగా తయారుచేసిన" గోధుమగవ్వ" లగును.

## గోధుమ కజ్జికాయ.

కొబ్బరి కోరును బెల్లముతో రసోకరాగా చేయవలయును. గోధుమ పిండిని నీటితోకలిపి, అప్పడమువలెచేసి, రసోకరాను దానియందుంచి కోలగా మడువ వలయును. అట్లు మడువబడిన దానిని, నేతిలోగాని, నూనెలోగాని, వేయించ వలయును. ఇట్లుతయారుచేసిన "గోధుమ కజ్జికాయ" యగును.

నాగాభట్ల మాణిక్యాంబ.

# శ్రీమతి సరోజినీ దేవి.

"నేను బ్రాహ్మణిని. 'భిక్షాందేహి' యని వచ్చితిని. నేను వేడుచున్నది పిడికెడన్నము కాదు; దేశసేవకై మీజీవిత సమర్పణము."

నాగపుర విశ్వవిద్యాలయ ప్రశస్తిప్రదానోత్సవమున ప్రధానభాషణమును శ్రద్ధతో విన్నవారు రసప్రవాహమున ఈదులాడిరి. పైపల్లవి వారివీనులందు ఝుంకరించినది. ఈసారి ప్రధానభాషణము సరోజినీ దేవిది.

పదుమూడేండ్ల ప్రాయముననే సరోజిని కావ్యప్రపంచమున కాలిడెను. అప్పుడే ఆమె కవితాశక్తి అంకురించినది. నాటినుండి కావ్యోద్యానమున వనదేవతవలె విహరించుచున్నది. ఆమె ఆడిన ఆట, పాడిన పాట కావ్యమయము కాని దేదియూలేదు. రసవంతమై ఉద్వేగపూరితమైన ఆమె భాషణమును విన్నవారిదే యదృష్టము. శుష్కోపచారపు సామాన్య భాషణముకూడ శ్రోతలయెదుట రూపుగొని నిలుచును. అదియొక కిన్నరీగానము, అప్సరో విలాసము. సరోజిని యొక్కసారి రాజకీయసమస్యా విషయమున జాయింట్ సెలెక్టు కమిటి (Joint Select Committee) ఎదుట సాక్ష్యమిచ్చెను. ఆసమితి యధ్యక్షుడు ఆమె సాక్ష్యమును గురించి వ్రాసినదిది: "నీరసమైన మన గద్యమయ సాహిత్యమునకు రసమయమైన కావ్యరూపము నిచ్చినది."

సరోజిని కవిత్వము ఆంగ్లమున. ఆంగ్లభాషలో కవిత్వముజెప్పి పేరుపొందిన ఆంగ్లేతరులు-అందునూ భారతీయులు-చాలతక్కువ. ఆమె 'స్వర్ణదేహళి' 'భగ్నపత్రములు' (Golden Threshold; Broken Wings) ఆంగ్లేయులనే మైమరపించినవి. ఆంగ్లేయుల సహజమధురమైన ఇంగ్లీషుకన్న మధురమీమె కవిత్వము. అన్యుల కావ్యసంగ్రహములను ప్రకటించుట ఆంగ్లప్రచురణాలయములకు అలవాటులేదు. అవి ఈ గౌరవమునకు పాత్రములుకావని వారియభిప్రాయము. సరోజిని కవిత్వము ఈసూత్రమునకు అపవాదము. నేటికిని ఇంగ్లాండులో కావ్యసంగ్రహములను ప్రకటించిన ఆంగ్లేతరులు చాలతక్కువ. ఒక్కరో ఇద్దరో. అంతేకాదు; ఆమె 'స్వర్ణదేహళి'కి సుప్రసిద్ధవిమర్శకచక్రవర్తియగు ఆర్థర్ సైమన్సు పీఠికను వ్రాసెను. సౌందర్య పిపాస, సౌందర్యోపాసనము, ఇవే ఈమెను కావ్యపథమునకు తెచ్చినవి. ప్రొద్దు తిరుగుడుపూవు సూర్యునివైపుతిరుగునట్లు ఈమెకన్నులు సౌందర్యమువైపు ప్రసరించును.

ఈ సౌందర్యపిపాసయే, అందచందముల నిష్ఠయే సరోజిని జీవితరహస్యము, గెలుపునకుదారి. ఆమె జీవన సంగీతమునకు శ్రుతి.

ఆమె జీవితరంగములన్నిటి యందునూ ఈశ్రుతి స్పష్టముగ నేపథ్యముననే వినవచ్చును. స్వదేశీఖాదీ తత్వము ఆమెకు నచ్చిననూ మొరటుగోనెపట్ట ఆమెకు సహించదు. ఆమె చేతిదారమునే ఉపయోగించును, కాని పట్టుబట్టనే కట్టును. హైదరాబాదులో ఆమె ఇల్లుండిననూ హిందూస్థాన ద్వారపట్టణమగు

బొంబాయిలో ఆమెనివాసము. అందునూ తాజ్ మహల్ హోటలులో. బొంబాయి తాజ్ మహల్ అన్నచో ఇంద్రభవనము. సత్యాగ్రహోద్యమమున ఆమె చెరసాలకు వెళ్లియుండెను. ఆజైలులో సూర్యకాంతి పుష్పములను పెంచుచుండెనట. అబీదునేల మూతిముడుచుకొనియుండుట ఆమెకు ఒప్పలేదు. పూలనైన పెంచి ఆనందింపవలెను. సరోజిని ఇంటి పేరుగూడ ఇంపైనది, 'స్వర్ణదేహళి.' ఇంటిలో అందమైన చిన్నతోట యొకటి. ముంగలిదాటి లోపటికి కాలిడిన వనశ్రీ ఆడుచుండుట కానవచ్చును. లతాకుంజము దాటినచో దివాన్ ఖానాలో (Office) వివిధవర్ణ సమ్మేళనపు సొబగు. నేలపై శ్రేష్ఠమైన పర్షియా తివాసీలు; వాటిపై నానావిధ మృగచర్మములు, నడుమ వివిధాకృతుల సుఖాసనములు. ఎదుట పద్మాసనస్థితుడై ప్రశాంతవదనముతోనున్న బుద్ధదేవుని దివ్యమూర్తి.

సౌందర్యమే సత్యము, సత్యమే సౌందర్యము, అని రెండుపంథలు. హరిహరుల ఆధిక్యవివాదము వంటిదే ఇది. ఈ వివాదము సారములేదనిపించుటకే కాబోలు కర్ణాటకులు హరిహరుని సృష్టించిరి. సత్యసౌందర్యముల ప్రశంసయూ అట్టిదే. రెండునూ వేర్వేరు అర్థముల ఒకేవిచారము. కాని అభిరుచులకు తగినట్లు జనులు భిన్నమార్గములతో ఒక్కచోటికే వత్తురు. రుచిప్రధానులైనవారికి మొదటిమార్గము మెప్పు; తత్వప్రధానులైన వారికి రెండవది యొప్పు. సరోజిని మొదటిగుంపుకు చేరినది. సుందరముగానిది, మాధుర్యములేనిది, సత్యదూరమైనదని యామె విశ్వాసము.

ఈ సౌందర్యపిపాసయే ఆమెను కావ్యలోకమునుండి రాజకీయ సామాజికక్షేత్రములవైపు త్రిప్పినది. రాజకీయపు చిలిపితనమామెకు సహ్యముకాదు. కాని ఆకవిహృదయమునకు తనదేశము, జనులు పరాధీనులై యుండుట కష్టమనిపించెను. తనదేశము, జనులు స్వతంత్రులై విశ్వకల్యాణోత్సవమున ముందు నిలువవలెనను ఆమె ఆశ పారతంత్ర్యమను వికారమును పోగొట్టుటకై పురిగొల్పుచున్నది. అహింసాతత్వ, ఆధ్యాత్మికములలో ఆమెకు అంతటినమ్మకములేదు. హింసలోని కరాళతభీభత్సములను చూచి విసుగుకొని అహింసా సౌందర్యమునకు శరణుజొచ్చినది. తత్వజీవనపు కఠినమార్గము ఆమెకు వ్యర్థమనిపించును; కాని మానవ జాతిలోని స్వార్థమయరాక్షసీ విలాసమునకు వెరగొంది తత్వజీవనమున అర్థము వెదుకుచున్నది.

సరోజిని ఇంటి జాబుజవాబులకు మెరసైననూ అందమైన చేతికాగితములనే ఉపయోగించును. హైందవ ఆర్థిక పునరుజ్జీవన చరమోపాయమైన ఖాదీయందు ఆమెకు ప్రీతిమెండు. దీనిలో గాంధీజీకన్న తక్కువకాదు. కాని ఆమెదృష్టి ఆర్థికముకాదు. గృహపరిశ్రమ, పల్లెల చేతిపరిశ్రమలతోనే హిందూస్థానపు బొక్కసము నిండుననుయోచన ఆమెకులేదు. వీటితో భారతీయ కళాకౌశలమునకు పునరుజ్జీవనమగును; రాట్నపు శ్రావ్యగానము వినవచ్చును. హిందూముస్లిము సౌభ్రాతృత్వమున ఆమెకు గాంధీ జవహర్ లాలులకున్నంతే శ్రద్ధయున్నది. అది జవహర్‌లాల్ రాజకీయ ఆదర్శమునూకాదు, గాంధీగారి నీతిధర్మ విశ్వాసమునూకాదు; స్త్రీసహజమైన సమరసజీవన చాపల్యముతో పుట్టిన నమ్మకము.

మొలకయందే గుణము తెలియును. లేబ్రాయమునుండియూ సరోజిని గొప్పమేధావి. పదిరెండు సంవత్సరములకే ఆమె మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణురాలయ్యెను. తరువాత సీమలో చదివెను. సీమలో తన మధురమైన కవిత్వములో జనులను ముగ్ధులగజేసి 'Nightingale of the East' (ప్రాచ్యకోకిల) అనిపించు

కొనెను. గాంధి, రవీంద్రనాథఠాకూర్, జవహరిలాలు నెహ్రూలకున్నంత జగద్విఖ్యాతి ఈమెకును కలదు. అమెరికా, ఆఫ్రికా, యూరపు ఖండములలో భారతసందేశమును తనదేఆయినప్రత్యేకరీతితో పంచినది. దక్షిణ ఆఫ్రికాలో హైందవులస్థితి చాల శోచనీయముగ నుండెను. తెల్లవారికి నల్ల భారతీయుల నక్కడ నిర్మూలము చేయవలెననుకోరిక ప్రబలియుండెను. భారత రాయబారివలె ఆఫ్రికాకువెళ్లి మనవారికి అప్పుడు బెంబల మిచ్చిన ధీరురాలీమె.

సీమనుండివచ్చినవెంటనె ఆమె మనస్సును కరిగించినది భారతీయస్త్రీల దైన్యావస్థ. స్త్రీ ఒకసొత్తు, పురుషుని భోగసామగ్రి-సాధన, స్త్రీకి స్వల్పస్వాతంత్ర్య మిచ్చిననూ చాలును, ప్రళయమే. నారిమారి; అన్ని యనర్థములకు కాంచనమువలె కామినికూడ మూలము. ఆచారవిచారములందు భారతీయులలో ఈభావన బలిసియుండెను. ఆదినుండి ఇది మన సంస్కృతిలోనుండెనో లేదోకాని పరాధీనులై శక్తిహీనులైనమీదట మనలోదూరి దాగుకొన్నది. మన సంస్కృతికి, జీవనమునకు, వికాసమునకు పట్టిన ఈత్రుప్పు ఆమె సౌందర్య దృష్టికి, పూర్ణజీవనకల్పనకు సరిపడలేదు. వెంటనే స్త్రీజనోద్ధరణ కార్యమునకు దొడగెను, నాటినుండి ఆమె భాషణములకు భారతీయస్త్రీల హక్కుబాధ్యతలు, ఆదర్శప్రేమములు, త్యాగసేవలు, పల్లవియయ్యెను. భారతీయ మహిళా స్వాతంత్ర్యసాధనకై దొరికిన ఏసందర్భమును ఆమెవ్యర్థముగ విడువలేదు. ఎవ్వరిమనస్సునూ నొప్పింపక, లేని ‘బడాయి’ కొట్టక, వాదవివాదములతో రచ్చకెక్కక, సద్దులేక, శాంతముగనే హిందూస్థానమున ఈ ఉద్యమమునడచెను. నారీజన పక్షపాతులమని చెప్పుకొనెడి ఇతరదేశములలో ఈ ఉద్యమము కుస్తీపట్లవరకు వచ్చెను. ముందునిలిచి ప్రయత్నసాహసములు చేసిన ధీరలుకొందరు చెరసాలనుకూడ చూచిరి, చాలకాలమువరకు సాంఘికజీవనమున అసమాధానము కలహములు నెలకొనియుండెను.

హిందూస్థానమున సద్దులేక కన్నుమూసి తెరచునంతలో ఈక్రాంతి నడచిపోయెను. ‘నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి’ యను వాక్యము పాతాళమున మునిగిపోయెను. స్వాతంత్ర్య సుందరధ్యేయోపాసనలో నారిలక్ష్మియైనది. స్త్రీపురుషులు వాగర్థములవలె అన్యోన్యాశ్రయముకలవారు. ఒకరికన్నొకరు ఎక్కువ కాదనుభావము వచ్చినది. సాంఘిక జీవనమున, రాజకీయరంగమున, శిక్షణమున, కుటుంబమున సామరస్యము పెరిగినది. స్త్రీపురుషులు సరిసమముగ సర్వక్షేత్రములలోనూ పనిజేయుచున్నారు. శాసనసభలలో స్త్రీలకు యోగ్యస్థలమున్నది. ప్రపంచమునకే ఉదాహరణముగ శ్రీమతి విజయలక్ష్మి మంత్రియయ్యెనుకదా?

ఈక్రాంతి పునరుజ్జీవనములకు గాంధిగారి ప్రభావము, వారిసత్యాగ్రహోద్యమములు చాలవరకు కారణమైననూ సరోజిని కృషికి ఆకీర్తిచెందవలెను. 1930 సత్యాగ్రహ సమరమున హైందవస్త్రీలు వహించిన భాగము, మోసినభారము, చేసినత్యాగము, సాటిలేనిది. అట్టిచిత్రమును ఎక్కడనూ ఎవ్వరునూ చూడలేదు. సరోజిని కుంచెపట్టి స్వయముగ చిత్రలేఖనమునకు పూనియుండినచో వన్నె ఎట్లుండియుండునో! స్వయముగ సరోజిని ఉప్పుసత్యాగ్రహమున దిగెను. ప్రసిద్ధిజెందిన ధరసనముట్టడికి ఆమెయే నాయకురాలు. అప్పుడామెచూపిన ధైర్యసాహస త్యాగములు మరపురానివి.

అప్పుడు మాత్రమేకాదు; అన్నిసమయములందునూ సరోజినికి స్వాతంత్ర్య సంగ్రామమున ప్రధాన పాత్రయుండినది. జైలు రుచిని కూడ చూచినది. 1919 రౌలట్ శాసనమును విరోధించి గాంధీజీ మొదటిసారి

విస్తారప్రమాణముతో సత్యాగ్రహము ప్రారభించినప్పుడే ఆమె అందు పాల్గొన్నది. అనధికృతమైన పత్రికలను బొంబాయి వీధులలో బాహాటముగ పంచిపెట్టినది.

సరోజిని మొదటనుండియూ దేశసేవలో పాటుపడినయామె. గాంధీజీ భారతదేశమునకు తిరిగివచ్చిన తరువాత దేశసేవ, రాజకీయములు మనకు ఇంటిమాటలైనవి. అంతకుముందు స్వాతంత్ర్యోద్యమమున పోరాడిన వీరులు లెక్కకు తక్కువయైననూ వెలలో హెచ్చు, గోఖలే, తిలక్, అనిబెసెంట్, దాదాభాయి మున్నగు వారందరూ మహాప్రాణులు. వారలు నాటినచెట్లకే మనము నీరుపోసి పెంచుచున్నాము. అప్పుడు బొంబాయి నూతనశక్తికి కేంద్రమైయుండెను. ఫిరోజ్‌షా మెహతా, గోఖలే, ఆప్రాంతమున స్వాతంత్ర్యభేరిని మ్రోగించిరి. సరోజినీ పేరుకు హైదరాబాదు వాసియైననూ బొంబాయిలోనే ఆమెయునికి. ఈనాయకుల ప్రభావ మామెపై ప్రసరింపక మానదయ్యె. వారలదేశభక్తిని తనవైపు త్రిప్పుకొనెను. ఇక్కడ మదరాసులో అనిబెసెంట్‌గారి హోంరూలు ఉద్యమము బలమైయుండెను. దీనికై ప్రభుత్వమువారి కృపకు గూడ పాత్రురాలై యామె చెరసాలలో నుండవలసివచ్చెను. ఇది సరోజినిమనస్సు నాకర్షించినది. ఈమె గాంధీజీకన్న ముందే కాంగ్రెసు వేదికనెక్కియుండెను. ఆమె భాషణములదివరకే జనుల మనస్సుల నాకర్షించియుండెను. ఆమె వాక్ప్రవాహము పారని సభలేదు; ఆవాణీవీణ పలుకని వేదికలేదు. సరోజినిపేరు దేశమంతట వ్యాపించియుండెను.

గాంధీజి దక్షిణ ఆఫ్రికానుండి హిందూదేశమునకు తిరిగివచ్చినప్పుడు ఆదివ్యశక్తిని గుర్తించినవారు కొందరుమాత్రమే. ఆచిన్నగుంపులో సరోజినిపేరు ముఖ్యమైనది. 1919 సత్యాగ్రహవ్రతమును బొంబాయిలో ప్రారంభించినప్పుడు ఆవ్రతమును గైకొన్న పది పండ్రెండుగురిలో ఈమె యొకతె. సత్యాగ్రహమును స్వీకరించిన విదుషీమణులలో ఈమె అగ్రురాలు.

గాంధీజీయందు సరోజినికి అపారభక్తి, గాఢవిశ్వాసము. ఆవీర వనితకు స్వాతంత్ర్య సాధనాక్షేత్రము స్వాభావికముగానే వశమైననూ ఆమెకావ్యమయ హృదయమునకు ఆత్మరహితమైన గొడ్డు ఆర్థికతత్త్వము, నీతిలేని శుష్కరాజకీయము తృప్తికలిగించలేదు. (దక్షిణాఫ్రికాలో) సత్యాగ్రహ జ్యోతిని వెలిగించి స్వదేశమునకు తెనుదిరిగిన గాంధీగారి తత్త్వ జీవనములు ఆమెను బలముగ ఆకర్షించినది. ఆమెశక్తికొక పదును చిక్కినట్లైనది; ధ్యానమున లోకమూర్తి దొరికినట్లైనది. ఆమె గాంధీజీని గురువుగా స్వీకరించెను. నాటినుండి హిందూస్థానమున మూలమూలలనూ గాంధీ గీతమును పాడుచున్నది. నూరురాగములలో నూరుఛందస్సులలో ఆపాట రూపుగొని యున్నది. వేయిమనస్సులలో ఆమెస్వాచార్య ప్రేమను స్థాపించినది. ఇందేకాదు; అన్యదేశములకు గూడ ఆసందేశమును పంపించినది.

'నారి కినిసినమారి' యనిపెద్దలాడినమాట. జలియనువాలా దురంతము, రౌలట్ శాసనము మున్నగునవి హిందూస్థాన హృదయమునుండి రక్తమును పిండిపేల్చినవి. శాంతి అహింసలకు మూర్తియైన గాంధీగారికే రక్తముడికినది. సరోజినికి కోపము వచ్చుటలో ఆశ్చర్యమేమి? అప్పుడు హైందవస్త్రీ ప్రతినిధియై ఇంగ్లండుకు వెళ్ళియుండెను. ప్రాచ్యకోకిలయని పొగిడిన ఆంగ్లేయులు ఆమె పిడుగుమ్రోతను వినిరి. ఝుంకారపు తుమ్మెదను చూచియుండిన జనులు టంకారపు నారినిచూచిరి. భారతస్త్రీలు పంజాబు

రాక్షసప్రకరణమున ఎంతటి యవమానమునకు గురియైనదియును, ఎట్లు ప్రభుత్వము ఆ అత్యాచారములను ప్రోత్సహించినదియును, ఆ అవర్ణనీయమైన సంగతులను స్పష్టముగ నిస్సంకోచముగ విశదముగ జనుల ఎదుటనే చెప్పి వారి నాగరికతను విమర్శించెను. జనులలో అల్లకల్లోలమయ్యెను. ఆంగ్లజనులు ఈభీభత్సమును సహింపరైరి. ఇంగ్లండు ప్రభుత్వమును చేతులు పిండుకొను నట్లయ్యెను. భారత ప్రభుత్వకార్యదర్శి మాంటెగ్యు సరోజినికి మంచిమాటలతో జాబులువ్రాసి ఆ అగ్నిని చల్లార్చు ప్రయత్నము చేయ వలసి వచ్చెను. ఇదంతయూ చాలకాలము క్రిందట, ఇరువది సంవత్సరముల క్రితము.

మలబారు మాపళాల వ్యవహారము కూడ ఇట్లే. పాపము ఈ మాపళాలు చిత్రహింసల పాలైరి. రైలుపెట్టెలలో పశువులవలె నింపబడిరి. సరోజిని మేఘనాదము మరియొకసారి వినవచ్చెను. భారత ప్రభుత్వమునకు మితిమీరిన కోపము వచ్చెను. ప్రభుత్వముపై ఆమె మోపిన తప్పులన్నిటిని ఉపసంహరించుకొన వలెనని బలవంతపెట్టిరి. కాని ఆమె ఇష్టపడలేదు. దాక్షిణ్యములేక ఆ సూచనను తిరస్కరించెను. కొన్నాళ్ళ తరువాత నిజము వెలువడెను. కాంగ్రెసు అన్నిటినీ బయలు చేసెను. సరోజినికీర్తి దేశమున నాట్యమాడెను.

ఇట్టిధీరజీవికి కాక మరెవ్వరికి మన్నన చెందవలెను? హిందూస్థానమున నేడురాష్ట్రపతిత్వముకన్న మించిన గొప్పమర్యాదలేదు. జనులు చెల్లింప వలసిన సన్మానములకిదియే పరమావధి. కాన్పూరుకాంగ్రెసుకు భారతదేశము నిండుమనస్సుతో సరోజినిని అధ్యక్షపదవికి ఎన్నుకొనెను. అంతకు మునుపుకాని తరువాత కాని అనిబెసెంట్ తప్ప ఏస్త్రీయూ ఆపదవిని పొందలేదు. ఇంతలోనే పొందులక్షణముకూడ లేదు.

సరోజిని రాజకీయ జీవితమంతయూ వట్టిపిడుగు పలుకులుకాదు. స్త్రీసహజమైన కవిగుణమైన సాహసోపాయమే ఆమెముఖ్యసాధనము. కాంగ్రెస్సులో స్త్రీపురుష సమానత రూఢిలో వచ్చినది. ఈమె పరిశ్రమ వల్లనే 1919 మాంట్ఫర్డు సంస్కరణలు వచ్చినప్పుడే యధికారము దొరికినది. అప్పుడు సరోజిని భారతమహిళా మండలమునకు నాయకురాలై ఇంగ్లండుకు వెళ్ళియుండెను. స్త్రీలకు వోట్లు (Votes) దొరికించిన యాకీర్తి ఆమెకే చెందవలెను. హైందవ స్త్రీలలో నేడు మనకగపడు ప్రగతికి పునాది ఆనాటిదే. తనసోదరీమణుల ప్రతినిధిగ మరియొకసారి ఇంగ్లండుకు వెళ్ళవలసిన సందర్భము వచ్చియుండెను. హిందూస్థానపు జాతకమును చర్చించుటకై Round Table Conference నడచినప్పుడు సరోజినియందు పాల్గొనెను. అనిబెసెంటు హోంరూల్ లీగ్ (Home Rule League) మండలితో కూడ ఇంగ్లండుచూచెను. హిందూస్థాన రాజకీయ రూపకములోని అంకములన్నిటి యందునూ ప్రేక్షకమనోజ్ఞయై ఈమె ప్రకాశించుచున్నది. ప్రత్యేకమైన ఆమెస్థానము సదా ఆమెకై నిరీక్షించుచున్నది.

సరోజినిది విలక్షణమైన పుట్టుక. ఆమెతమ్ములు చెల్లెండ్రు వివిధమార్గములందు ప్రతిభాశాలులై యున్నారు. జ్యేష్ఠుడైన వీరేంద్రనాథుడు హిందూస్థానమునుండి వెలియై జర్మని రష్యాలలో సామ్యవాద విప్లవమును జరుపుచుండ, చిన్నవాడైన హరీంద్రనాథుడు అరవిందయోగి పాదములంటి కళాప్రపంచ చక్రవర్తియై విహరించుచున్నాడు. చెల్లెండ్రలో ఒకయామె సాహిత్యవేత్త, ఇంకొకయామె

కమ్యూనిస్టు (Communist.) సరోజిని తండ్రి అఘోరనాథ చటోపాధ్యాయులు మైసూరులో కొంత కాలము ప్రొఫెసర్‌గా నుండి తరువాత హైదరాబాదు చేరి అక్కడనే నిలిచిరి. వారియోగజీవిత కుసుమము సరోజిని.

సరోజినికి రెంటియందు నిశ్చలమైనశ్రద్ధ: ఒకటి గాంధీజీవనము; ఇంకొకటి మానవకోటిలో ఐక్య కంఠము. భేదభావము విరసము, అపశృతి. సుందర జీవన సామ్యభావమే మానవ జీవితమునకు పూర్ణ సౌందర్యము. ఆమెకు ఈనమ్మకము వట్టి ఆచారము కాదు. వీణకు తంతివలె జీవాళము. గాంధీజీ జీవితమున ఈమె ఈసమరస జీవనశృతిని వినుచున్నది, అదియే ఆమెశ్రద్ధకు కారణము.

మూడుసంవత్సరముల క్రిందట కలకత్తాలో భగవాన్ రామకృష్ణపరమహంసుల శతమానోత్సవ సందర్భమున సర్వధర్మ సమ్మేళనము నడచెను. అప్పుడు సర్వధర్మసమ్మతమైన ప్రార్థనను ఇంపుగ రసవంతముగ సరోజిని పాడెను. ఆ అమోఘప్రార్థన చిరకాలము నిలువగలది; జగత్ శ్రోత్రమున సదాధ్వనింపుచుండ వలసినది.

[సుప్రసిద్ధ కన్నడ సాహిత్యవేత్త శ్రీమాన్ కృష్ణశర్మగారు కన్నడమున వ్రాసిన దానికి ఇది అనువాదము.]

అనువాదకులు

శ్రీ డా. ఎ. వి. దేశికాచార్య యం. డి. (హోమియో)

[ఇందు వివరింపబడిన జీవితము 1942 పర్యంతము. కాంగ్రెసు కార్యకారిణి సభ్యురాలుగా నీమెయు ఇతరులతోపాటు అరెస్టయినది. వీరిని గాంధీ దంపతులతో పాటు 'ఆగాఖాన్ రాజభవనము' న నుంచిరి. నిజమున కది రాజభవనమనదగినది కాదట. అయినను ఆమె నివసించినది రాజభవనముగా విరాజిల్లియుండును. మహాత్ముని జన్మదినోత్సవము నామె యెంతో విలక్షణముగా నచట యేర్పాటుచేసెనని పిదప పత్రికల ప్రకటింపబడినది. ఆపిదప క్రమముగా మహాత్ముని ఉపవాసమును, కస్తూరిబా వ్యాధియు, మృతియు జరిగినవి. వెంట వెంటనే శ్రీ సరోజినీదేవికిని గాంధీకిని మలేరియా తగిలినది. సరోజినీ ప్రమాదస్థితికి వచ్చెనని ఝడిసి ప్రభుత్వమువారు విడుదలగావించిరి. దైవవశమున ప్రమాదముగడిచి, ఆమె యథారీతిని దేశసేవ సంఘసేవ గావించుచున్నది. గృ॥ సం॥]

# రేడియో ప్రసంగము

తీరిక సమయాలలో ఫోటోగ్రఫీ సంభాషణ

శ్రీమతి యం. సుశీలగారు.

భాను : స్త్రీ అంటే కళామూర్తి. సహజంగా స్త్రీ సుకుమారి కాబట్టి, లలితకళలు ఏవైనా నేర్చుకొంటే, స్త్రీ జీవితానికి ఒక అలంకారంగానూ, నిత్యజీవితానికి ఉపయోగకరంగానూ వుంటుంది. అంతేగానీ, ఎందుకూపనికిరాని ఫోటోగ్రఫీ నేర్చుకొంటే బాగుంటుందంటావేమిటి సుశీలా ?

సుశీల : అంటే నీ వుద్దేశంలో ఫోటోగ్రఫీ లలితకళ కాదనేకదూ? చిత్రలేఖనం లలితకళ అని వొప్పుకుంటావా? లేదా?

భా : ఔనూ, లలితకళే?

సు: చిత్రలేఖనం కుటుంబానికి చెందిందే ఫోటోగ్రఫీ. ఫోటోగ్రఫీ లేకపోతే ఈనాటి సినిమాకళ ఎక్కడుండేదీ? సినిమాలంటే చెవికోసుకుంటావుకదా, తెరమీద చూసే బొమ్మలన్నీ వాటంతటవి, నీకోసమని తెరమీద ఆడడం లేదని తెలుసుకో సినిమాకి ముఖ్య అంగము ఫోటోగ్రఫీ.

భా: సరేనమ్మా. ఫోటోగ్రఫీ చాలా అవసరమే అనుకో. నీకు ఎందుకు పనికి వస్తుందీ అంటాను.

సు: నాకేకాదు. ఈ ఫోటోగ్రఫీ సరదా అందరికీ వుండితీరాలంటాను. ఎందుకంటే స్మృతులను కొన్నిటిని భౌతికంగా చిత్రరూపంలో, పవిత్రంగా, పదిలంగా దాచుకోడానికి సావకాశంవుంటుంది. పైగా, ఫోటోగ్రఫీ ఎంతసరదాగా వుంటుందనుకొన్నావు.

భా:- మాతమ్ముడున్నాడే-వాడికి తెల్లారిలేస్తే ఇదే పని. మా ఇంట్లో ఎక్కడ చూచినా ఫోటోలే చిన్నవీ, పెద్దవీని. ఎక్కడచూచినా ఫోటో సరంజామే.

సు: మీవాడు అలా ఫోటోలుతీస్తూ, ఆవృత్తిలోనే కృషిచేస్తే, చాలా పెద్దవాడవుతాడు. చూడమ్మా మా బాబుకి పుట్టినప్పటినుంచీ ప్రతీ ఏడాదీ ఫోటోలు తీశాను. బాబు పెద్దవాడౌతున్నాడు. మొన్న ఎందుకో ఆల్బమ్ తీశాను.

వాడిఫోటోలు ఒకొక్కటేతీసి చూడ్డంమొదలెట్టాను. ఒక్కొక్కఏడాదికిఒక్కొక్క మోస్తరుగా కనిపిస్తున్నాడు. ఒక్కొక్కఫోటో, అప్పటిలో వాడి ఆకతాయితనం, మరి ఆనాటికి కనిపించే మరొక మంచిగుణమో జ్ఞప్తికి తెచ్చింది. అలాఫోటోలన్నీ పెట్టుకు చూసుకుంటూ ఎంత ఆనందించాననీ. గడిచిపోయిన జీవితాన్ని చిత్రరూపంలో నిల్పుకో వాలంటే, ఫొటోగ్రఫీ తప్పక నేర్చుకోవాలమ్మా.

భా:- అన్నట్టూ మా అమ్మమ్మ మా తాతగారి ఫోటో అంటూ, మండపేట నుంచి తెచ్చి చూపించింది. పెద్దగిరజాల జుట్టు, ఐదువేళ్లకీ ఐదువుంగరాలు. రసికుల్లా కనిపించారు మాతాతగారు. ఇంక చూచుకో. మా అమ్మమ్మ, ఆయన అప్పట్లోగడిపిన జీవితంగురించి పూసగుచ్చినట్లుచెప్పి, మా తాతగార్ని తలుచుకొని కంటనీరెట్టుకుంది.

సు: చూచావా. ఫోటోగ్రఫీ నేర్చుకోడం ఎంత అవసరమో.

భా: మనం ఎందుకు నేర్చుకోవాలంటాను? ఫోటోలు తీసేవారు బోలెడంత మంది వున్నారు. వారిని పిలిపించి, కావలసినన్ని ఫోటోలు తీయించుకోవచ్చుగా.

సు: తీరుబాటుగా కుటుంబమంతా, తళతళమెరిసే చీరెలు కట్టుకొని, పోజు పెట్టిఫోటోగ్రఫర్ చేత ఫోటోలు తీయించుకోవచ్చులే. అందుకూ ఫోటోగ్రఫీయేవృత్తిగా పెట్టుకొన్నవారున్నారు. ఒకవూరు వెళతావనుకో. అక్కడ ప్రకృతి రామణీయకతను చూసి మురిసిపోతావు. ఆప్రకృతి సౌందర్యాన్ని ఫోటోలో ఇముడ్చుకుందుకూ, నీతో పాటు ఫోటోగ్రఫర్ వుండడుగా. మరిఎలాగా. చరిత్రాత్మకమైన ఒకప్రదేశానికి వెళతావు అనుకో, అక్కడ అద్భుతమైనశిల్పచాతుర్యం కనిపిస్తుంది, ఆకట్టడాల్లో. అదంతా చిత్రం లోనిర్మించుకోడం ఎలాగా. అంతదూరం ఎందుకూ? నీబాబే టబ్బులో స్నానంచేస్తూ వుంటాడు. ఓసమయంలో ఎంతో ముచ్చటగా స్నానంచేస్తూవుండగా కనిపిస్తాడు. అప్పుడు వాడిఫోటో తీయడం ఎలాగో? ఫోటోగ్రఫర్ని పరుగెత్తుకొనివెళ్లి పిలుస్తావా?

భా: ఓహో, ఇప్పుడు అర్థమౌతూందిలే, తీరిక సమయాల్లో ఫోటోగ్రఫీ, నేర్చు కోడంలోని అవసరం. నువ్వుచెబుతూంటే జ్ఞాపకానికి వచ్చిందీ, మొన్నమాఅమ్మలూ, ఇంటిదగ్గర డాన్సుచేస్తూ-కృష్ణునికోసం వెతుకుతూన్న రాథభంగిమ పెట్టింది. అబ్బా, ఎంత బాగుందను కొన్నావు; అలా ఫోటోతీయించాలమ్మా?

సు: ఆభంగిమలో మీఅమ్మాయికి ఫొటోగ్రఫర్‌ని పిలిచి, నీవు ఫోటోతీయించ గలవా? అమ్మలూ ఆభంగిమ అస్తమానం పెట్టదుగా. అందుకే ఫొటోగ్రఫీనేర్చుకుంటే ఓ కేమేరాతో అటువంటి ముద్దులొలికే ఘట్టాలనూ ఫోటోతీయవచ్చును.

భా: ఫొటోగ్రఫీనేర్చుకోడం అంటే అంత సులువుటమ్మా. ఎంత డబ్బుఖర్చు పెట్టాలీ, ఎంతప్రయాసపడాలి. పైగా, ఇంత కర్చుపెట్టి, తీరా ఫొటోలుతీస్తే బొమ్మ మినహా తతిమ్మావన్నీ పడతాయి ఫొటోలో. అందుచేత తీరికసమయాల్లో, ఫొటోగ్రఫీ నేర్చుకోడం డబ్బు దండగ తప్ప మరొకటేమీలేదు.

సు: ఏచిన్న లలితకళ నేర్చుకోడానికైనా, డబ్బుకర్చుపెట్టాల్సివుందిగా. నిజానికి నన్నడిగితే ఫొటోగ్రఫీ ఆడవాళ్లే నేర్చుకోవాలంటాను. ఎందుకంటే చాలామంది స్త్రీలు, కళాదేవతలు. వారిభావనాశక్తి ఎంతో నిశితంగా వుంటుంది. ఈ రెండు సుగుణాలు, ఫొటోగ్రఫీకి చాల ముఖ్య అవసరాలు. వీటిని పెంపొందించుకొంటే ఎంతబాగుంటుంది. బొమ్మలు తీయడంలోచాలా శ్రమవుంటుందంటున్నావు. చిత్రలేఖనంలోశ్రమలేదూ? లేసు అల్లికలోశ్రమలేదూ? పనీ అనగానే శ్రమవుండి తీరుతుంది. మనం పడేశ్రమకి ఫలితం దక్కాలీ అంటే ఓర్పుకావాలి. ఓర్పుకీ స్త్రీపెట్టిందిపేరు. అవునా? అందుచేత తీరిక సమయంలో తప్పక మనం ఫొటోగ్రఫీ నేర్చుకుంటే బాగుంటుంది.

భా: ఫొటోగ్రఫీలో కూడా పోటీ పరీక్షలున్నాయిట కదూ?

సు: లేకపోవడ మేమిటీ, మనం తీసిన బొమ్మలు చాలా బాగుంటే బహుమతులు కూడా వస్తాయి. అనుకోని దృశ్యాలు, సన్నివేశాలు, ఘట్టాలు, భంగిమలూ—వీటి నన్నిటినీ, ఫొటోలుతీసి పంపిస్తే మెప్పూవస్తుందీ, బహుమానం చేకూరుతుంది.

భా: మరి నాకూ, నువ్వూఫొటోగ్రఫీ నేర్పుతావా? అయితే నేనూ ఒక కేమెరా కొంటాను.

సు: తప్పకుండానూ. కేమెరా కొనేటప్పుడు నన్నుకూడా బజారుకి తీసుకెళ్లు. మంచిదిచూసి కొందాము.

భా: సరేనమ్మా.

(ఆల్ఇండియా రేడియో అనుమతిని.)

(రేడియో ప్రసంగములగావించు నారీమణులు, ఆలిండియా రేడియోవారి అనుమతిని పొంది మాకంపుచో ఇక్లే ప్రకటించుచుందుము. గృ॥ సం॥)

# కుశలమా?

శ్రీ ఎల్. జనార్దనశర్మ, కేసరీ హైస్కూలు, చెన్నపురి.



దేశపోషణకై యాత్మీయ జీవనవాయు
          వర్షించు రైతుల వరుగుచేసి,
భారతీరత్నగర్భా సంపదలనెల్ల
          పాదోధి బడబాగ్ని పాలుసేసి,
ఆకలి బాధచే నకనక లాడించి
          నిరుపేద ప్రాణాల నీఱుసేసి,
అడియాస గల్గించి యాహవ మాయలో
          పాప మమాయిక ప్రజలఁ జంపి,

మనసునఁ గరుణ లవలేశఁ మైనలేక,
శ్వేతముఖు లాత్మ సామ్రాజ్యభూతమునకు,
బలిమి నొసగెడి బలులను బ్రామలేక,
ఎచటికేగితో గృహలక్ష్మి యిన్నినాళ్లు ?

నీదు సంతానముల్ నిర్మల సౌశీల్య
          సక్తముం జేయు ప్రవక్తవీవు,
భవదీయ పుత్త్రికాభరణమ్ముల మెఱుంగు
          వెల్లెడి సత్కళా విజ్ఞవీవు,
యుష్మత్కుమారికా త్యున్నతాశయముల
          పలుమఱుఁ బ్రకటించుఁ బలుకుఁ జెలివి,
నీ ముద్దుబిడ్డల నిలయాలలో వెల్గు
          లలిత మంగళ గృహలక్ష్మివీవు,

ఆంధ్రసీమంతినీ హృదయాంతరాళ
నవ నవోన్మేష భావసూన ప్రభాత
గంధవాహమ్ము లాశలఁ గడలుకొనఁగ,
నేగుదెంచితో! యిన్నాళ్లునెచ్చటుంటొ?

# బాలానందం

నాటిక

ఒంటె

పాత్రలు

రామం     కృష్ణ

సుబ్బు     లలిత

రామం: ఏమిరా కృష్ణా, నిన్నో ప్రశ్న అడుగుతాను చెప్తావా?

కృష్ణ: ఓ ఒకటేమిటి, వంద చెప్తా.

రామం: మామూలు ప్రశ్న కాదురా యిది.

సుబ్బు: చక్కగా పొడుపుకథలాంటి ప్రశ్న అడగరా.

రామం: అయితే, చెప్తాను. జ్ఞాపకం పెట్టుకోండి. ఒకమాటవుంది, దానిలో అయిదు అక్షరాలున్నాయి. మొదటి రెండక్షరాలు కలిపితే ఒక పదార్థం పేరు; అది లేకపోతే మనం నిముషం బ్రతకలేం. చిగురు మూడక్షరాలు కలిపితే, ఒక డిప్పలాంటి వస్తువ, అది ఒక విషజంతువు కుంటుంది. మూడో అక్షరం, అయిదవ అక్షరం కలిపితే కోపానికి అర్థం. ఈ ఐదక్షరాలు కలిపితే, మనం ఆడుకొనే వస్తువు పేరు. అదేమిటో చెప్పండి?

లలిత: చెమ్మచెక్క.

కృష్ణ: ఏడిశావులే. చెమ్మచెక్క గాదు, చెడుగుడీ గాదు.

రామం: నువ్వు చెప్పరా కృష్ణా. మరెన్నో చెప్పేస్తానన్నావు కాదు.

కృష్ణ: ఉండరా రామం, ఆలోచించనీ.

సుబ్బు: వీడు ఆలోచించేసరికి తెల్లవారుతుంది. నువ్వే చెప్పరా.

రామం: వాడు చెప్తానన్నాడు కదూ. గాలి: ఇది లేకపోతే మనం బ్రతగ్గలమా? రెండోది పడగ. మరి పాముకుంటుంది కదూ. పగ అంటే కోపం. మొత్తం అయిదక్షరాలు కలిపితే గాలిపడగ కాలేదూ?

కృష్ణ. ఓ.స్. నేనదే చెబుదాం అనుకున్నాను. నువ్వే చెప్పేశావు.

రామం: అయితే చెప్పలేక పోయావా?

కృష్ణ: అయితే నేనొకటి అడుగుతాను, చూడు. 'ఒంటి మిట్ట' అనే పేరుంది. అరెరే, పేరు చెప్పేశాను, ఇంకేమడగను?



సుబ్బు: బాగుంది. ఒంటిమిట్ట, లొట్టిపిట్టాను.

లలిత: లొట్టిపిట్టేమిటి, సుబ్బూ?

సుబ్బు: గువ్వపిట్టలాంటిదేనే లలితా.

రామం: ఏడిచినట్టేవుంది. లొట్టిపిట్టంటే ఒంటె.

లలిత: ఓహో! గాడిదలాంటిదా?

కృష్ణ: అదిట్రా; మొన్న సర్కస్‌వాళ్ల సామాన్లు మోసుకువచ్చింది.

రామం: మరే; అదీ లొట్టిపిట్టంటే.

కృష్ణ: అదేమిట్రా. అంతవంకర టింకరగావుంది?

సుబ్బు: అవును, కొంగమెడలా మెడ, పెద్ద పెద్ద కాళ్లూ, నడ్డిమీద మూపురాలూను.

రామం: మరే. అదెంత వంకరగావుందో, దానిబ్రతు కంత గమ్మత్తుగా వుంటుంది.

లలిత: ఆగమ్మత్తేమిటో చెప్పవన్నయ్యా.

రామం: మనం మంచినీళ్లెక్కడ దాచుకుంటాం.

కృష్ణ: వంట ఇంట్లో.

రామం: వంటింట్లోనేలే. ఎక్కడని.

కృష్ణ: బిందెల్లోను.

రామం: మన ఆవులికి, గేదెలకి మంచినీళ్లు కావలసివస్తే?

కృష్ణ: మనంపోస్తే తాగుతాయి. లేకపోతే అరుస్తాయి.

సుబ్బు: లేకపోతే, తాడుతెంచుకొని పారిపోయి చెరువుల్లో తాగుతాయి.

రామం: మరి లొట్టిపిట్ట ఏంచేస్తుందో తెలుసునా కడుపులో దాచుకుంటుంది.

సుబ్బు: దానికడుపులో వంటిల్లుంటుం దేమిట్రా?

రామం: వంటిల్లు లేదుగాని, మనబిందెల్లాటివే సంచులుంటాయి. నీళ్లుత్రాగినప్పుడల్లా ఆసంచులు నిండా నింపుకుంటుంది. మళ్లీ మూడునాలుగు రోజులదాకా నీళ్లడగదు.

లలిత: అయితే దానికి దాహంవెయ్యదూ?

రాము: దాహమూ వేస్తుంది, కడుపులోని సంచుల్లోనీళ్లే త్రాగుతుంది.

కృష్ణ: ఎలా త్రాగుతుంది? చెంబుతోటా.

రామం: మన ఆవులు నెమరువేయటంలేదూ? గబగబా తినేస్తుందా. తీరుబాటుగా పడుకొని కడుపులోది కాస్త కాస్త తీసుకొని నవులుతూవుండదూ?

లలిత: ఓహో! కోతుల్లాగా.

సుబ్బు: అవును మొన్నకోతివచ్చి, వేరుశనగకాయలు వడేస్తే, గబగబ, నోట్లోసంచుల్లో కుక్కేసుకుంది.

కృష్ణ: అయితే కడుపులో దాచుకోవడం ఎందుకు? కావలసినప్పుడల్లా త్రాగకూడదా?

రామం: మనకైతే ఎక్కడబడితే అక్కడదొరుకుతాయి నీళ్లుత్రాగడానికి. ఇలాగ అన్ని దేశాల్లోను దొరకవు. కొన్ని కొన్నిచోట్ల ఎడారులని వుంటాయి. ఎడారులంటే, ఒకటే ఇసుక, ఒకటే ఇసుక,

ఎటు చూచినా ఇసుకే. ఎక్కడా నీళ్లుకనపడవు. చెట్లూ చేమావుండదు. ఎన్ని మైళ్లు నడిచినా ఇసుకపర్రలే. నడవగా, నడవగా, నడవగా ఎక్కడో ఒకచోట దొరుకుతాయినీళ్లు. అక్కడే చెట్లూ అవీ కనబడతాయి. ఒకచోట బయలుదేరితే మళ్లీ నీళ్లువుండే చోటువరకు నడిచితీరవలసిందే. పైన ఎండ, క్రింద ఇసక. మరి, యింతదూరం ఎండలో నడవాలంటే మంచినీళ్లక్కరలేదు?

సుబ్బు: మంచినీళ్లేమిటి? అన్నంకూడా కావాలి.

రామం: మరే. అందుచేత, మంచినీళ్లు దొరకవని, కడుపులోని సంచుల్లో పోసుకొని దాచుకుంటుంది. ఆమంచినీళ్లు వున్నచోటనున్న చెట్లాకులు ఆకలిదీరా తింటుంది.

సుబ్బు: అయితే, మచినీళ్లు దొరకనిచోట ఎందుకు ఉండడం ఇది?

రామం: అక్కడ పుట్టిందిగనుక అక్కడే వుంటుంది.

సుబ్బు: అయితే ఇసకలో నడుస్తూంవుంటే కాళ్లుమాడిపోవు?

రామం: మాడిపోతాయిగాని, ఒంటెపాదాలకి అడుగుని మనచెప్పులంతలావు చర్మంవుంటుంది.

సుబ్బు: మరైతే గబగబా నడవగలదా?

రామం: అందుకే దించుపోకుండా వాటిపాదాలు ఏనుగు చెవుల్లా చారెడుంటాయి. అంచేత ఇసకలో దిగిపోవు గనుక గబగబ పరుగెడుతుంది.

లలిత: పరుగెడుతూ పరుగెడుతూ ఇసకలో కాలుజారి దభేలున పడుతుంది.

రామం: దభేలునా పడదు, గుభేలునాపడదు. పరుగెట్టడానికి వీలుగావుండడానికే అంతపొడ వాటి కాళ్లుంటాయి.

సుబ్బు: ఎందుకు మరి అక్కడనుంచి ఇక్కడకి ఇక్కడనుంచి అక్కడికి తిరగడం. నీళ్లున్నచోట పడివుండకుండా?

రామం: అక్కడున్న జనం వీటిమీద ప్రయాణంచేస్తూ వుంటారు. అంచేత అటూ ఇటూ తిరుగుతూ వుంటాయి.

కృష్ణ: అయితేవాటిమీద ఎక్కడ మెట్లా?

లలిత: నిచ్చెనేసుకుని ఆటకెక్కినట్లు ఎక్కాలి.

రామం: నిచ్చెనా అక్కర్లేదు, గిచ్చెనా అక్కర్లేదు. పడుకోమంటే పడుకుంటుంది. నుంచోమంటే నుంచుంటుంది. ఏంచెబితే అదిచేస్తుంది.

సుబ్బు: అయితే పాడమంటే పాడుతుందీ, మన గ్రామఫోనులాగ?

రామం: ఏడిశావులే. మాట్లాడదు. దానివంటిమీదతట్టి నేర్పుతారు, పడుకోవడం. మన ఆవుల్లాగ, ఎద్దుల్లాగాను.

సుబ్బు: ఓహో. గంగిరెద్దులాగ, "డూ డూ బసవన్నా పెళ్లాడుతావా" అంటే, తలవూపుతుంది.

లలిత: కాదురాసుబ్బు, మనరాధాగారి కుక్క షేక్‌హేండు ఇవ్వదూ? అలాగే.

రామం: మరే. అలాగే నేర్పుతారు, పడుకోవడమూను. ఆపడుకున్నప్పుడే వాటిమీద సామానులు వేసుకుని కూర్చుంటారు.

లలిత: మళ్లాలేస్తే పడిపోరు.

రామం: పడిపోరు. అదినడుస్తూవుంటే, ఊగిసలాడుతూ నడుస్తుంది. వూగిసలాడుతున్నా పడిపోరు. ఎంతబరువైనా మోస్తుంది. ఎంతనడకైనా నడుస్తుంది. దానిబ్రతుకూ అదీ, అదోవెర్రిమాలోకం లావుంటుంది.

కృష్ణ: అదా, లొట్టిపిట్టన్నా, ఒంటె అన్నాను. చాలాగమ్మత్తుగా వుందిరా.

——(o)——

# భరతమాత

శ్రీమతి పోలవరపు కాంతమ్మ, పెదకొత్తపల్లి.

(1)

శ్రీనివాసంబైన శ్రీనగరము నీకు క్రీడాస్థలమ్ముగా కీరవాణి
పెట్టనికోటలౌ పెను హిమాచలములు శత్రుదుర్భేద్యముల్ సర్వవంద్య
రతనంపు పనిగల రాణి ముంతాజ్మహల్ దివ్యగేహమునీకు దేవవనిత
సర్వరత్నములందు సన్నుతిగాంచిన కోహినూరొప్పు నీకురులయందు

గంగయమునాది నదులన్ని కాంతినొసగు
పూలమాలలు గదనీకు పూవుబోడి
అఖిలజీవుల కాధారమగుదువమ్మ
భవ్యగుణరాశి సముపేత భరతమాత !

ప్రభుసేవకై పుత్రప్రాణంబు లిచ్చిన పరమసాధ్వియునైన పన్నయెవరు?
శీలంబుకై తమ జీవంబులిచ్చిన మల్లమ్మ పద్మినీ మహిళలెవరు?
పురుషునిజీవంబు పోయినదని విని ప్రాణంబు వీడిన పద్మ యెవరు?
దేశంబురక్షింప ధీరయై ప్రాణంబు లక్ష్యపెట్టని ఝాన్సిలక్ష్మియెవరు ?

ఖడ్గతిక్కనవీరుని కదనమంపి
మహితశౌర్యంబు జూపిన మగువలెవరు?
అన్నపూర్ణమ్మ కమలాది యతివ లెవరు?
భవ్యపుత్రిక సముపేత ! భరతమాత !

(ఈబాలిక తన 13 వ ఏట రచించిన వీపద్యములు.)

(2)

శ్రీ మతుకుమల్లి నరసింహంగారు, ఉప్పలవాడు.

ఖండాంతరము నుండి గదిసిన పరసేన భంజించి మించెను పడఁతియొకతె,
స్వామిద్రోహము సేయ సమకట్టు నాథుని కంఠంబు నఱికెను కాంతయొకతె
తనమీది వ్యామోహమునఁ బోయె ననికని, తలఁ ద్రుంపి పలికించె తరుణియొకతె,
సమరంబునను కంట శరము నాటినైన వెన్నుఁ జూపకయున్న వెలఁదియొకతె,

భరతనారీమ తల్లుల పౌరుషంబు
నిరుపమానము సద్యశఃకరము టంచు
నెల్లదేశంబులఁ దేటతెల్లమయ్యె
భవ్యసుతవర్గ సముపేత! భరతమాత!

(౧ ఝాన్సి లక్ష్మీబాయి. ౨ వీరమాత 3 హాడారాణి ౪ దుర్గాబాయి.)



# వరకట్నాలు.



శ్రీమతి ఆచంట రత్నకుమారిగారు.

ప్రస్తుతము దేశమంతయూ అనేక సమస్యలతో నిండియున్నది. వానిలో కట్నముల బాధ పెద్ద సమస్య. ఇది ఆడుబిడ్డల తలిదండ్రుల రక్తమాంసములను పీల్చుచున్నది. ఇదిపేదకన్నెల పాలిటి యమకింకరుడు. వారివారి చదువులను బట్టివరుల విక్రయపుధరలు వారితలిదండ్రులే నిర్ణయించినారు. మొదటిఫారం చదివిన వానికి వెయ్యిన్నూటపదహార్లు. మూడవఫారము చదివిన వానికి రెండువేలు. స్కూల్ ఫైనల్ మూడుదండయాత్రలు చేసిన వానికి మూడువేలు. ఎఫ్. ఎ. చదివినవానికి నాలుగువేలు. బి. ఎ. చదివినవానికి ఐదువేలు. ఇవి అసలు నిర్ణయించిన కంట్రోలు ధరలు. ఇంకాపైచదువుల వారినికొనలేము. ఇవిగాక సందర్భానుసారంగా రేట్లు హెచ్చింపబడును. గొప్పవారైన యెడల ఈధరలు చెల్లించుకోగలరు. కాని పేదవారెట్లు చెల్లించగలరు? ఈకట్నము లింతకఠోరముగా నున్నప్పుడు పేదకన్నెలయొక్కయు, వారితలిదండ్రుల యొక్కయు ఆర్తనాదములతో దేశమంతయూ నిండియుండగా, భారతమాత తనబిడ్డలింత వివేకవిహీనులై, పశుప్రాయులై, నిర్దయులైనంతలో పశువులవలె తమపుత్రుల నమ్ముచుండగాచూచి, కన్నీరు కార్చుచున్నపుడు దేశములో శాంతియేవిధముగా నుండును?

కాన, కన్నెల పాలిటి మృత్యుదేవత యగు కట్నాల పిశాచిని పెంపొందింప జేయుచున్న తలితండ్రులార! మీవి ఏమాత్రం జాలిగుండెలైనను, మీరు కొంచమైనను కన్నుతెఱచి కన్యాలోకమును విలోకించినను, మీకు న్యాయాన్యాయ, ధర్మాధర్మ విచక్షణ యణుమాత్రమైన యున్ననూ, మీరీవధ్యశిలకు కన్నెలను బలిచేయ దలచుకొనక పోయినను కట్నములు పుచ్చుకొనరు. మీబిడ్డలను విక్రయించిన సొమ్ముతోనే మీయాస్తులను పెంపొందింప జేసుకొనెదరా? ఇదిమీకు న్యాయమేనా? మీకు యెంత ఆస్తియున్న కొలదిని, ఎంత యున్నత పదవులలో నున్నకొలదిని, కట్నములంత కంతకు తగ్గించుటకు మారుగా హెచ్చించుచున్నారే? ఇదిమీకేకాదు. భారతమాతకే తీగని యవమానము.

తలిదండ్రులచేతి కీలుబొమ్మలై, వారికిబానిసలై, అస్వతంత్రజీవితము చేయుచున్న యువకులార! చదువుకున్న వారు వారిచదువును ఒకరు బాగుపడునట్లును, ఒకరికి వుపయోగ పడునట్లును, వినియోగింపవలెను. కాని మీరో! ఒక కన్నెనైననూ యుద్ధరించినారా? ఒకరికన్నీరైననూ తుడువగలిగినారా? ఒకయింటినైననూ నిలబెట్టినారా! లేదు! లేదు! లేదు! మీబాగు కొరకు, మీశరీర పోషణ జరుపుకొనుటకుగూడ మీరు చదువుకొనుచున్నారు. అందుచే అధమాధమమైన స్త్రీ ధనముతో, మీవిక్రయలాభముతో మీరు పెద్దచదువులు చదవదలచినారా? కన్నెల తలితండ్రుల యార్తనాదము లన్నియు మీవద్ద చెవిటివానివద్దశంఖ మూదినట్లేనా? కన్నెతలిదండ్రుల యార్తనాదముల ద్వారా యీకట్నాల పిశాచిని, అంతులేని

ఆశాపరులైన యీరాక్షసిని, మీమనస్సులలో చిత్రించుకొనుడు. అప్పుడది ఎంతభయంకరముగా, ఎంతవికృతముగా కనబడునో? అప్పటికైననూ మీహృదయములు కరుగకపోయిన గొడల మీరు వజ్రహృదయులు. "మాకొరకు మీరుకట్నములు అడగవద్దు; పుచ్చుకొనవద్దు." అని మీతలితండ్రులతో చెప్పునంతటి స్వతంత్రమును, ధైర్యమునూ మీకులేదా? మీరు యిష్టపడకపోయినను, మీరు స్వతంత్రించినను, మీతలిదండ్రులు కట్నములను పుచ్చుకొనగలరా? మొన్న నొకపెండ్లికొడుకు "మూడువేలు, నాలుగువేలు వారే యిస్తామని వస్తూవుంటే కట్నమిచ్చుకోలేని బీదపిల్లను పెండ్లాడుట యేమిఖర్మం?" అన్నాడట! అవగా మీరే దీనికి దోహద మిచ్చుచున్నారు. మీయంతట మీరే సంతలోని పశువులై పోయినారు, ఎంతటి ఆశ్చర్యము ?

అందుచే మీకు నేనిచ్చే సలహా యేమిటంటే, కొన్నిరోజులలో మీరుపెట్టినబ్లాక్ మార్కెట్ ధరలు పడగొట్టి, ప్రభుత్వమువారు కంట్రోలు పెట్టుచున్నారుకాన, మీధరలు పడిపోకముందే, వచ్చిందే ధాన్యమనుకొని ఏదో యొకవిధముగా విక్రయింప బడండి. మిమ్ములిని కొనగలవారు కొనెదరు. లేనివారు లేదు. ఇక సెలవు.

జైహింద్.

—(o)—

# ఆశీర్వచనము

★

శ్రీ అయ్యగారు విశ్వేశ్వరావుగారు, ఉండి.

★

కవికుమార రచిత ఖండకావ్యాలను మణిభూషలుగఁ దాల్చి మసలుమమ్మ
తెలుఁగుబిడ్డలు నిన్ను దీవించి ముద్దాడ నగుమోము వికసింప నడువవమ్మ
పరివార లేనీకుఁ జాగిలించెడినాఁడు నిందు గర్వంబున నిలుపవమ్మ
"సఖియ! రా ర"మ్మను సారసాక్షులప్రేమ ధనధాన్యముల రీతిదాచుకొమ్మ

జననమందితి కేసరి సదనమందు, మూటగట్టితి యశము నమూల్యగతిని,
సంతతానందదాయివై, స్తవ్యవగుచు, చిట్టిగృహలక్ష్మి! మనగదే చిరతరమ్ము.




శివ శివా ఎంత పనిజరిగింది!

కళాభిరుచి, కళాభినివేశము కలిగి స్త్రీలున్ను పురుషులతోపాటు కళోపాసనాసక్తితో కలిసి మెలిసి తిరుగుతారు. కళా ప్రదర్శనము ద్రష్టలకు, శ్రోతలకు హాయిచే కూరుస్తుంది. కాబట్టి ధనార్జనకు మార్గ మేర్పడింది. అందుచేత కళోపాసకులైన ప్రదర్శకులు కొందరు దానిని భుక్తిమార్గం కూడా చేసుకొన్నారు. అంత మాత్రంచేత వారికి కళ యందుగల భక్తికేమీ లోటు రాలేదు. డబ్బుతీసుకొని కళోపాసకురాండ్రు తమ హావభావాలను మనోహరంగా ప్రదర్శిస్తున్నారు గదా అని వారిని చౌకగా చూడడం ఎవరికైనా నీచము. ద్రష్టలను ప్రత్యక్షంగా ఎదుర్కొని తమ హావభావాలను చూపడంలేదు; యంత్రం యెదుట నిలిచే, తద్వారా, ఆయావాటికి ప్రజలఎదుట ప్రదర్శన యోగ్యత కల్పిస్తున్నాము-అని వారిసంతోషము, ధైర్యము. ఆమేరకు వారి అభిమానాన్ని అభినందింప దగును. అంతే కాదు. ఆయంత్రంద్వారా వారు తమ కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నపుడు, తాముస్వయంగా ప్రజల ఎదుట పడి సిగ్గుభిడియాలు వదల నవసరము లేదుగదా అన్న వారి విశ్వాసమును, పవిత్రమైన విశ్వాసమును, ఆయంత్రాలను నడపడానికిన్నీ, ఉత్తమరీతిని ఆ స్త్రీలు తమ అంద చందాలతో నైపుణ్యాన్ని ప్రదర్శించ గలుగ డానికిన్నీ, తప్పని సరిగా ఆప్రాంతాలలో ఉండ వలసి వచ్చిన పురుషులు మన్నించవలె ననేది వారివిధ్యుక్తధర్మము. అందుకు తగిన నిగ్రహమును, పెద్దమనిషి తరహాను వారు అలవరుచు కోవాలి. లేకపోతే తా మేకళాదేవి నాశ్రయించి పొట్టబోసు కొంటున్నారో, ఆదేవత యెడలనే ద్రోహచింత కలవారవుతున్నారు. అలాంటి దుర్యోగమనస్కులైన బొంబాయి స్టూడియో డైరెక్టరును, అతని అనుచరులును, శ్రీమతి నళిని అనే యక్ట్రెస్‌గరల్ నటియెడల గావించిన దుర్మార్గమును తలుచుకుంటే వళ్లుఝల్లుమంటుంది. ఈఫిబ్రవరి 'రూపవాణి' సవిస్తరంగా ఈ దుష్ట నాటకమును ఫిలిం ఇండియా, పత్రికనుండి అనువదించి, ప్రకటించింది. గాని మేము స్థలవిస్తర భీతిచేతను, ఆకథా కథనమందలి అసహ్యత చేతను ప్రచురింప జాలకున్నాము.

ఆనళినీ కన్య దుండగీండ్రపై సాహసించి అభియోగంతెచ్చి, సాటి నటీలోకానికి మహోప కారం చేసింది. వారందరినీ హైకోర్టువారు, 5 మొ|| 7 సం || ల వరకూ శిక్షించి-సినిమా ప్రపంచంలో అబలల విషయమై జాగ్రత్తగా ఉండవలెననే హద్దులు కల్పించి ధన్యులైనారు. ఇందుకు మేమెంతైనా సంతసిస్తున్నాము. నటీమణులున్ను, మత్తులైన పురుషుల అవ్యక్త ప్రసంగాలకు, అసంగతపు చనువులకు తావివ్వకుండా, కళాప్రదర్శనమునకు సంబంధించినంత మేరకే, వారిని మర్యాద, ఔచిత్యము మీరని దరికి చేరనివ్వదగునని సలహా యిస్తున్నాము. అంతకు మించినప్పుడు స్త్రీలు నిర్మొగమాటంగా, నిర్భయంగా,

ధైర్యసాహసాలతో వాచా, అవసరమైతే, చేతాకూడా, వారికి గట్టిగా బుద్ధిచెప్పనేర్చి ఉండాలనిన్నీ వారిని హెచ్చరిస్తున్నాము.

## కీ. శే. యలెన్ విల్కిన్‌సన్ కన్య.

బ్రిటిష్ కార్మిక మంత్రివర్గములో విద్యాశాఖకు మంత్రిణిగానున్న శ్రీమతి యలెన్ విల్కిన్‌సన్ కన్య 60 సం|| ల ప్రాయమైనా నిండకుండానే కీర్తిశేషురాలైనదని వినుటకు చింతిలుచున్నాము. ఆమె చరిత్రను వేరొకచో నిచ్చియున్నాము, కావున ఇక్కడ విస్తారంగా వివరింపదలుచుకోలేదు. ఆమె భారతీయుల యెడల, భారతీయ సమస్యలయెడల చాలా సానుభూతిగల యామె, అని ఆమె 1932 లో భారతదేశానికివచ్చి, నాటి నిర్బంధవిధానాన్ని కండ్లారాచూచి వెళ్లడమే సాక్షి. నేడు భారతదేశానికి సానుభూతిచూపే బ్రిటిష్‌రాజకీయ వేత్తలు కార్యరూపేణా ఆసానుభూతిని చూపదగిన తరుణంవచ్చిఉన్నది. ఇలాంటప్పుడు కార్యశూరిణియైన బ్రిటిష్‌రాజకీయవేత్త, అందులోనూ కాబినేటులో మంత్రిణి, స్వర్గస్థురాలు కావడం భారతదేశానికి గొప్ప నష్టము. ఆమె చరిత్ర చదివినవారికి, తగిన అవకాశాలు ఉంటే, స్త్రీ ఎంతత్వరలో ఔన్నత్యానికి రావచ్చునో తెలుస్తుంది. నూతనావకాశాలు భారత నారీమణులకు నలుముఖాలా కన్పిస్తున్నవి. కాబట్టి ఈమె చరిత్ర వారి కెంతైనా ప్రోత్సాహకరముగా ఉంటుంది అని మానమ్మకం. ఆమె ఆజన్మాంతము కన్యగానే గడిపినది. ఉత్తమప్రయోజనం ఆదర్శంగా పెట్టుకొని రాత్రింబవళ్లు పనిచేసే స్త్రీకైనా సంసార జంజాటకం అవసరమనిపించదు అని ఆసంగతి చాటుచున్నది. శ్రీమతి విల్కిన్‌సన్ గారి ఆత్మకు శాంతి కలుగుగాక అని ఈశ్వరుని ప్రార్థిస్తున్నాము.

## స్త్రీలకు సంబంధించిన క్రొత్తబిల్లులు.

రాష్ట్రములలో, కేంద్రంలో జాతీయవాద ప్రభుత్వాలు సర్దుకోగానే, ప్రజాహితకరమైన బిల్లులు శాసన సభ్యులచేతా మంత్రులచేతా ప్రవేశ పెట్టబడుతున్నాయి. మద్రాసు రాష్ట్రములో స్త్రీల ఆస్తిహక్కుల చట్టం ప్రభుత్వము ప్రవేశపెట్టినది. ఇదివరలో కేంద్రశాసన సభలోనే స్త్రీలకు ఆస్తి హక్కుల చట్టం ఏర్పడ్డది. అయితే భూవసతి రాష్ట్రాల అధీనం కాబట్టి అది మినహాయింప బడ్డది. చాలారాష్ట్రాలు ఇదివరకే ఈమినహాయింపును తొలగించుకొన్నాయి. ఇప్పుడు మనరాష్ట్రం ఆపని చేస్తున్నది. ప్రభుత్వంవారే పూర్వం చేయబడినదేవదాసీల చట్టమునకు సవరణ బిల్లు పెడుతున్నారు. శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు వేరొకచో ప్రచురింపబడిన భోగంమేళాల నిషేధపు బిల్లుప్రవేశ పెట్టడానికి సంసిద్ధమై, ప్రభుత్వము వారే తమదేవదాసీబిల్లులో ఈబిల్లును కూడా కలుపుతాము అన్నమీదట ఉపసంహరించుకున్నారు. చిరకాలముగా సంఘసంస్కరణ కంకణం కట్టుకున్న శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు బహుభార్యాత్వ నిషేధము, విడాకుల హక్కును కలిపి ఒకబిల్లు ప్రవేశపెట్టినారు. దానినుపపాదించుటకు శాసనసభ సమ్మతించినది. వీరీరెండు బిల్లులు విడివిడిగా పెడితే బాగుండును. శ్రీ. యన్. యస్. వరదాచారిగారి వంటివారు బహుభార్యానిషేధం వప్పుకుంటున్నారు; విడాకులపద్ధతి వప్పుకోవడంలేదు. బొంబాయిలో శ్రీమతి హన్సా మెహతాగారు ఏకపత్నీధర్మమును శాసిస్తూ బిల్లుప్రవేశపెట్టినారు. దానివెంటనే విడాకుల

చట్టంగూడా ప్రవేశపెట్టారట. కేంద్రంలో హిందూధర్మశాస్త్రరీత్యా జరిగిన పూర్వ వివాహాలను గూడా, విడాకుల చట్టం ఉపయోగించుకోడానికి అనుకూలంగా, రిజస్ట్రేషన్ చేసుకోడానికి సమ్మతించే సవరణబిల్లు ప్రవేశపెట్టినారు; ఆబిల్లు సెలెక్టుకమిటీ పరమైనది. శ్రీ ప్రకాశ్ గారు శాఖాంతర వర్ణాంతర వివాహముల బిల్లుప్రవేశ పెట్టినారు. సెలక్టు కమిటీకి పంపబడినది. ఇదివరకే కేంద్రములో సగోత్ర వివాహముల బిల్లు అంగీకృత మైనది. ఈప్రకారము అనేక బిల్లులు చట్టములు కాబోతున్నవి. వీటిపై శాసన సభలలో తీవ్రమైన చర్చలు సాగబోతున్నవి. కాబట్టి ఈబిల్లులను గూర్చి మాఅభిప్రాయములను క్రమముగా ప్రకటిస్తాము. కాని మేము హెచ్చుగా కోరేది ప్రజాభిప్రాయం వ్యక్తీకరించడం. కాబట్టి ఆయాబిల్లులమీద, ముఖ్యముగా స్త్రీలను, తమ అభిప్రాయములను వ్రాసిపంపుడని ఆహ్వానిస్తున్నాము. ఈబిల్లులు చిరకాలంనాటి సాంఘికాచారాలను సంబంధించినవి. అలాంటప్పుడునిజమైన ప్రజాభిప్రాయం వెలువడవలెనంటే, పూర్వ పక్షసిద్ధాంతాలు సంపూర్ణంగా వెల్లడికావాలంటే. పార్టీ శిక్షణల పేరట శాసన సభ్యుల వ్యక్తి అభిప్రాయాలను అరికట్టరాదు. సాంఘిక చట్టములు నిర్మించే విషయములో సభ్యులకు స్వేచ్ఛ యివ్వవలసినది- అని శ్రీ కాళేశ్వర రావు పంతులుగారే కోరిఉన్నారు. ఇదిచాలాసబబు అని మాఅభిప్రాయం. పూర్వం శారదాచట్టం విషయంలోకూడా కీ. శే. మోతీలాలు నెహ్రూగారు తనపార్టీసభ్యులకు స్వేచ్ఛయిచ్చి ఉన్నారు. దేశమంతటా శాసన సభలలో పెద్దపార్టీని నడుపుతున్న కాంగ్రెసు హైకమాండువారు జనరల్ రూల్ వకటి ఇట్టిది ఏర్పరచడం మంచిది అని మాఅభిప్రాయం. ఈలోపలనే శ్రీ ప్రకాశంపంతులుగారు తమ అభిప్రాయం మార్చుకొని శ్రీ కాళేశ్వరరావు గారి సూచన నంగీకరింతురని ఆశిస్తున్నాము.

## అమెరికా స్త్రీల అఘాయిత్యం.

ఎవరైనా ఇరుగూ పొరుగూ కొత్తవారు వచ్చారూ_అంటే వారిని గృహలక్ష్ములు ఆదరించడం ఏదేశానికైన మర్యాద. అలాంటి మర్యాద తెలియని దేశాన్ని నాగరికము అనడానికి వీలులేదు. కాని అమెరికాలో శ్వేత జాతి స్త్రీలు, నీగ్రోకుటుంబాల ఎడల చూపిన అఘాయిత్యం అసహ్య కరంగా కనిపిస్తున్నది. ఆకుటుంబాలలో పురుషులు అమెరికా సంయుక్తరాష్ట్రముల ఝుండాక్రింద విదేశాలలో మిగత యూరపియన్, నల్ల, పచ్చ జాతులతో పాటు యుద్ధంచేసి అమెరికాకు అఖండమైన గౌరవ ప్రపత్తులు సంపాదించిన వారే. వారు విజయగర్వితులై యుద్ధరంగంలో వలెనే కుటుంబాలతో సహా తెల్లజాతులతో కలిసి మెలిసి ఉండవచ్చు అనుకున్నారు కాబోలు! చికాగో పట్నంలో తాము ఏర్పాటు చేసుకొన్న కొత్త యిండ్లల్లో దిగబోయినారు. లారీల మీద సామాను వచ్చినది; భార్యా భర్తలు, పిల్లలు ఆసామానులు దించుకుంటున్నారు. 200-మంది శ్వేత జాతిజనం వారిని ముట్టడి-వేశారు. వేళాకోళం చేస్తూ కేకలు పెట్టారు. తృప్తిలేక రాళ్లువిసిరారు. నల్లవాళ్లు తెల్లవాళ్లు, కొందరు చర్చిలకు సంబంధించినవారు వచ్చి హెచ్చు ప్రమాదం జరిగేలోపలనే ఆసామాను లోపలికి సాయం పట్టారు. ఈఅల్లరులు చేసినవారిలో హెచ్చు మంది-శ్వేతజాతిస్త్రీలు! అల్లరి చిల్లర పిల్లలు కాదు; కాపురాలు చేస్తున్న-ఇల్లాండ్రు. పోలీసులు వచ్చి, వారిలో నాయకు రాండ్రను పట్టుకొని వీపులు చరిచేదాకా సద్దుమణిగింది కాదు. శ్వేతజాతి

స్త్రీలకు సహా నల్లజాతులంటే ఇంత అసూయా అసహ్యతా ఉంటే, విశ్వమానవసౌభ్రాతృత్వము, ప్రపంచ శాంతి ఏమొగం పెట్టుకొని ఏర్పడ బోతున్నవి?

## కొబ్బరి నూనె.

కొబ్బరినూనె ధరలకు చెన్నపురి ప్రభుత్వంవారు కంట్రోలు రేట్లు నిర్ణయించారు. ఆనిర్ణయించడానికి కారణంఏమిటాయని మేమిక్కడ ప్రశ్నించడంలేదు. దాని అవసరావసరములను అడిగి తెలుసుకోవలసినవారు, తెలుసుకోదగినవారు, శాసనసభ్యులు ఉండనే ఉన్నారు. మంత్రివర్గపక్షము, వ్యతిరేకపక్షము అనే తేడాలేకుండా ఉభయపక్షాలకు చెందినవారున్నూ చాలామంది నిత్యమూ మంత్రివర్గపు చర్యలను తూర్పారపట్టుతూనే ఉన్నారు. కాని ఎప్పుడైతే కంట్రోలుధరలు ఏర్పడ్డవో, ఏర్పడతాయనే వాసనకొట్టిందో, అప్పుడే కొబ్బరినూనె అంతర్వాహిని అయిపోయింది. కంట్రోలు ధరలకు మూడునాలుగురేట్లు హెచ్చుపెడితేనేగాని దొరకడంలేదనీ, అదిన్నీ కల్తీసరుకు అనీ, ఊరూర గోల. ఈబ్లాకుమార్కెట్టు మనకే వచ్చిందని, ఇదంతా ప్రకాశంమంత్రివర్గం అసమర్ధతఅని మనం విమర్శించనక్కరలేదు. ప్రజాస్వాతంత్ర్యం చిరకాలంక్రింద పుట్టిన ఫ్రాన్సులో బ్లాక్ మార్కెట్టు పబ్లికుగా సాగుతున్నదట; ఆమాట అనుకొనేవాడు లేడట. బంగారు బ్లాక్ మార్కెట్ ధర-పత్రికలలో, ధరవరులలో బహిరంగంగా ప్రచురిస్తున్నారని-ఆమధ్య "ఇల్లస్ట్రెటెడ్ వీక్లీ" లో వేసియున్నారు. అయితే అట్లా అని సమాధానపెట్టుకోమనికాదు, మేము చెప్పేది. ఎందుకు కంట్రోలుపెట్టారు అని ప్రభుత్వాన్ని నిగ్రహించి పలుకక-కంట్రోలువల్ల ప్రజలకావస్తువు లభ్యంకాని ఇబ్బంది తొలిగే ఉపాయమే మేము సూచించేది కొబ్బరినూనె స్త్రీపురుషులందరికీ నిత్యావసరము. మన ఉష్ణదేశంలో, అదీ వేసవిసమీపిస్తున్నపుడు, కొబ్బరినూనె తలకు రాయకతప్పదు ఎంతపేదవానికైనా, పేదదానికైనా. పోనీపురుషులను విడిచినా, స్త్రీలకైనా, పరిమితముగానైనా దొరకే ఉపాయమును ప్రభుత్వము కల్పించవలెను. కిర్సనాయిలు, బియ్యం కట్టెలు గుడ్డలవలెనే-కొబ్బరినూనెనుకూడా రేషన్ పద్ధతిని స్త్రీలకైనా చిక్కేటట్లు ఏర్పరచడం శ్రేయస్కరము. కొబ్బరినూనె లేకపోతే తలలు వేడిఎక్కుతాయి. వేడెక్కినతలలు వెర్రితలలు అవుతాయి. తస్మాత్, జాగ్రత! అని ప్రభుత్వమువారిని వినయపూర్వకంగా హెచ్చరించవలసి వస్తున్నది.

## సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవం.

1930 నుండీ ప్రారంభమైన స్వాతంత్ర్య దినోత్సవము ఈసంవత్సరం కూడాయథాప్రకారము దేశమంతటా విజయవంతంగా జరిగింది. అందులో ఆంధ్రదేశం చెప్పనే అక్కరలేదు; కాంగ్రెసు ఉత్సాహంలో ఆంధ్రులదే ముందునడక. వేలకొలది గ్రామాలలో, వందల కొద్ది పట్నాలలో జాతీయ ఝండా ఎగురవేసి ఆంధ్ర స్త్రీలు పురుషులు స్వాతంత్ర్య ప్రతిజ్ఞను, తీసుకొని ఉంటారు. ఆప్రతిజ్ఞలో ఉన్న రాజకీయము లట్లుంచి, ఆచరణ సాధ్యమగు నిర్మాణకార్యక్రమమును స్త్రీపురుష లందరూ అవలంబింపదగును. ముఖ్యముగా స్త్రీలు కార్యతత్పరులు కావడంచేత వారినే విశేషంగా ఈవిషయంలో హెచ్చరిస్తున్నాము. ఆప్రతిజ్ఞలో ఈక్రింది వాక్యాలు ఇమిడి వున్నవి:—



గృహలక్ష్ములు సంపూర్ణస్వాతంత్ర్యప్రతిజ్ఞను అమలుజరిపే ఉత్తమపద్ధతి

# విజ్ఞప్తి

"గృహలక్ష్మి" యందలి రచయితల చిత్రపటములు ప్రచురింపుడని పలువురు కోరుచున్నారు. ఆకోరిక మాకిదివరకేగల అభిలాషను ఇనుమడింపచేసినది. కాన క్లుప్తమగు తమచరిత్రలతో పాటు చిత్రపటములనుగూడ రచయితలు మాకంపగోరెదము.

సంపాదకుడు.

"మన ఏడులక్షల గ్రామాలకు మళ్ళీ జీవం పొయ్యడానికీ ప్రజలను పీల్చేస్తున్న దారిద్ర్యం తొలగించడానికీ ఉపాయముగా రాటము ఖద్దరూ మన నిర్మాణ కార్య క్రమంలో చేరియున్నవి కనుక స్వంతానికి ఖద్దరే కట్టుకుంటాము. వీలు పడినంతవరకు పల్లెటూళ్లలో తయ్యారయ్యే వస్తువులే వాడుకుంటాము. ఇతరులనుకూడా ఇలా తిప్పడానికి ప్రయత్నిస్తాము."

పైవిధంగా దీక్షతీసుకున్న స్త్రీలందరు ఈమూడు వాక్యాలను పూర్తిగా అమలులో పెడితే గొప్ప దేశోపకారంచేసిన వారవుతారు. ఖద్దరుయందు విశ్వాసము ప్రకటించేవారైనా ఖద్దరు నుత్పత్తిచేసి కట్టుకుంటే-వస్త్రసమస్య చాలాతగ్గుతుంది. పల్లెటూళ్లలో తయారయ్యే వస్తువులే వాడితే బ్రిటిష్‌వారు మన కివ్వవలసిన స్టర్లింగుల అప్పు కర్పూరంవలె కరిగిపోకుండా కాపాడి, దేశానికవసరమైన, అత్యవసరమైన, యంత్రసామగ్రిని తెచ్చుకోవడానికి సాయంచేసిన వారవుతారు. మనకు వారి సబ్బులమీద, ఫేస్‌పౌడర్ల మీద, టూత్‌పేస్టులమీద, పిన్నులమీద, రిబ్బన్లమీద, బిస్కత్తులమీద, చాకొలేట్లమీద గలమోజు వారికి బాగాతెలుసు. అందుచేత స్టర్లింగు అప్పులనుకాగితముమీదచూపిస్తూ, వాచా దానిని తీర్చు విషయమై ప్రసంగిస్తూ, చల్లగా ఈ చిన్న చిన్న వస్తువులను మనకంపి ఈసంవత్సరన్నరలో 100-150 కోట్ల పౌ॥ లు అప్పుతీర్చుకున్నారని వింటున్నాము. కావున వాటికాశించక మనము మనదేశంలోనే, ఇండ్లల్లోగాని, యంత్రాలలోగాని, తయారయేవే వాడుకొన్నట్లైతే ఆఅప్పు కరిగిపోక ఏనాటికైనా మనకు పనికి వస్తుంది. పల్లెటూళ్లల్లో తయారయేవి అంటే పల్లెటూరిలోనే కాదు. గృహాంగణాలలో, కుటీరాలలో, అని అర్థము, యంత్రసామగ్రి మనకు క్లుప్తమైన రోజులలో మనకు చేతిపనుల వస్తువులే శరణ్యము. స్త్రీలు పెద్ద పరుగులకు పోనక్కరలేదు. మేముక్రమంగా మాపత్రికయందు "బ్రతుకుతెరువు" అనేశీర్షిక క్రింద చెప్పేవన్నీ, ఆంధ్రనారీమణులు చేయబూనుకుంటేచాలు అని మా అభిప్రాయము. అట్లా చేసిననాడే మీ స్వాతంత్ర్య ప్రతిజ్ఞ అర్థసహిత మవుతుంది; లేకపోతే, హాస్యాస్పదమే.

## శ్రీమతి సరోజినినాయుడు గారి షష్ఠిపూర్తి.

ఎప్పుడున్నూ నారీమణుల వయస్సెంచరాదు అంటారు. అందుచేత 'శ్రీమతి సరోజిని నాయుడుగారికి షష్ఠిపూర్తిగావచ్చుచున్నది; ఆ ఉత్సవంఘనంగా చేయవలయును' అనే వారికోరిక మేమెన్నడున్నూ హర్షించ లేదు. ఆ సంగతిలోకంగమనించరాదు; గమనించినా ఆమెకు తెలియనివ్వరాదు; అని మా అభిప్రాయం. ఇంతకూ, పట్టుకున్నా ఆగని కాలచక్రం, 60 సం॥ లకాలం ఆమెపుట్టినతర్వాత తిరిగిపోయిందేకాని ఆమె భావాలలోగాని, ఊహాపోహలలోగాని, ప్రజాహితకరకార్యకలాపాలలోగాని, తారుణ్యం ఏమిజంకింది? ఆకిన్నరీకంఠంలో వయఃపరిపాకం తెల్పడానికి జీర అయినా యేర్పడినదా? సమ్మోహనాస్త్రంలాంటి ఆమె ఉపన్యాసంలో జిగిబిగి ఇంచుకంతైనా సడలిందా? మన అలంకారశాస్త్రజ్ఞులు ఈవయస్సువారిని "లోల" అన్నారు. కాని ఈమెమాత్రం ఇంకా అతఃపూర్వమైన ప్రౌఢావస్థలోనే యున్నదని చెప్పదగును. అయినా, మనోబుద్ధులకు తారుణ్యం సడలకున్నా, ఐహికభోగలాలసపరాయణత్వంగల సౌందర్యపిపాసియైనా ఆధ్యాత్మికసంపత్తిగల విదుషీమణి కావడంచేత, హైదరాబాదున, స్వగృహంలో, భర్త, బిడ్డలు, బంధువులు పరివేష్టించి, ఉండగా నిరాడంబరముగా, షష్ఠిపూర్తి ఉత్సవం జరిపించినదని వార్త. ఈమె ఆంధ్ర గృహలక్ష్మి కావడంచేత, ఆపరిసరాలకువచ్చేసరికి ఆంధ్రులకు సహజమైన షష్ఠిపూర్తిపిచ్చి ఆమెకూ పట్టుకున్నదేమో అనికూడా మాకనిపిస్తున్నది. ఈ విలక్షణమైన శుభసమయాన చిరకాలమిట్లే కుంకుమ శోభితురాలై దేశసేవ, సంఘసేవ, కళాసేవ మున్నగునవియొనర్చుచుండు గాకయని మేమాశిస్తున్నాము.

# శ్రీమతి ఎలెన్ విల్కిన్సన్ కన్య

శ్రీమతి ఎలెన్ విల్కిన్సన్ కన్య అద్భుత చరిత్రగలది. బ్రిటిష్‌దీవులలో మార్గరేట్ బాండ్‌ఫీల్డు తరువాత మంత్రిపదవి నధిష్టింప గల్గిన దీమెయే. ఉభయులున్నూ కార్మిక పక్షమునకు చెందినవారు. విల్కిన్సన్ కన్య ఇన్సూరెన్సు ఏజంటు కూమార్తె. మాంచస్టరులో మిల్లుకూలీపిల్లగా మొదట పని చేసినది. కార్మికపక్షంలోచేరి విద్యాసక్తి నలవరచు కొన్నది. శ్రద్ధతో చదివి మాంచస్టరు విశ్వవిద్యాలయంలో యం. ఎ. డిగ్రి పొందింది. 5 అడుగుల కురుచదేహం, ఎర్రటితలకట్టు. అయితేనేమి పిట్టకొంచం, కూతఘనం. తీవ్రమైన స్వభావం; చురుకైన నాలుక. ప్రకాశమైన తెలివితేటలు. ట్రేడ్ యూనియన్‌లో నాయకురాలైపని చేసింది. ఆడవాళ్లకు ఓట్లుకావాలనే ఆందోళనలో పాల్గొన్నది. ఉజ్వలంగావ్రాస్తుంది. పత్రికా రచయిత; నవలా కర్త. 1924 లో కార్మికపక్షంతరుపున పార్లమెంటు కెన్నుకోబడ్డది. 31 వరకు అందుండినది. అయితే కార్మికపక్షాన్ని ద్రోహంచేసి మెగ్డొనాల్డు తిరిగీ ఎన్నికలు పెట్టినప్పుడు ఈమెకూడా పలువురితోపాటు ఓడిపోయింది. 1934 లో తిరిగీ ఎన్నుకో బడినది. 1936లో పార్లమెంటు సభ్యురాలుగా తననియోజకవర్గంలో నౌకానిర్మాణాశయంలోకూలీలజీతనాతాలకై-వారినందరిని నిరాహారదీక్షాపరులనొనర్చి-వారికి ముందునిల్చి పార్లమెంటుకు రాయబారం నడిచినది. అందుచేతనే ఆమెస్నేహితుడు ఆమెకు సన్నాహశక్తి, పరిపాలనాశక్తి అనే వానికన్నా, ఆందోళనా శక్తిహెచ్చు అని అన్నాడు. ఆమె ఈరెంట తీసికట్టుగా భావించరాదు. యుద్ధకాలంలో ఆమె హోమ్ సెక్యూరిటీ మంత్రిగారికి పార్లమెంటరీ కార్యదర్శిగా పని చేసినది. 1945 లో కార్మికమంత్రివర్గంలో విద్యామంత్రిణి అయి ఆమె చాలా కృషిచేసినది. ఆంగ్ల బాలబాలికలకు హైస్కూలు విద్యకూడా నిర్బంధంగా ఏర్పరచి పిల్లలుబడివిడిచే వయస్సు 15 సం॥లకు హెచ్చించినది. ఈవిధంగా ఆంగ్లదేశంలో ఉన్నతవిద్య సర్వసామాన్యంచేసిన సరస్వతీదేవి. ఆమెస్కీము ఈ ఏప్రిల్ 15 తేదిన అమలులోకి వస్తుందిట. పాపము తనస్కీమును తాను ఆచరణలోపెట్టడానికి నోచుకోకుండా రెండు నెలలు ముందుగానే హఠాత్తుగా హృద్రోగం వల్ల మరణించినది. ఆమె భారతదేశానికి చాలా కావలసినమనిషి. జవహరిలాలు నెహ్రూ స్నేహితురాలు. 1932 లో లండన్ నందలి ఇండియాలో లీగు భారతదేశంలో నిర్బంధ విధాన విజృంభణను స్వయంగా చూచి రమ్మంటే మరొకస్నేహితునితో కూడా వచ్చినది. సర్వమూ కళ్లారచూచి వెళ్లి, తనకు గలిగిన మనోవేదనను తనదేశంలో ప్రజలయెదుట చేటలచెరిగి చెప్పింది. ఈమె సాహసంతెల్పే ఉదంతాలు ఒకటిరెండు చెప్తాము. స్పెయిన్ అంతః కలహపు రోజులలో అక్కడికి వెళ్లి ప్రజాసామాన్యం తరపున నిల్చి వారికి సాయంచేసింది. ఆసందర్భంలో బాంబుఘాత కూడా రెండుసార్లు తప్పించుకుంది, 1936 లో, హోటల్ గుడ్డమడతలలో దాగి హిట్లరు రైన్‌నదీ దండయాత్ర వార్తలనెటిగి రహస్యంగా ఇంగ్లాండుకు టెలిఫోన్‌ద్వారా తెలియచేసింది. లండన్ విమానదాడులలో జంకుకొంచు లేకుండా షెల్టరులలోదూరి పనిచేసింది. ఆమెవయస్సు ఎవ్వరూ ఎక్కడా చెప్పి ఉండలేదు. కాని1891 లో పుట్టినదట. 56 సం॥ లకే ఇంతగొప్ప జీవితం గడిపి హఠాత్తుగా కళ్లుమూసుకున్న ఈకన్య ఏదేశమైనా ఆదరణతో సంస్మరించదగిన వ్యక్తి. ఎందుచేతనో, ఈమెమరణ కారణం విచారణ జరుగబోతున్నది.

—:o:—

# సమకాలిక పత్రికలు మాకొసగిన స్వాగతము.



......డాక్టరు కేసరి గారే ఇదివరలో "గృహలక్ష్మి" అనే పత్రిక నడిపారు. ఇది ఆడవాళ్ళ పత్రిక. చాలా బాగా వుండేది. యుద్ధం వచ్చిం తరువాత ఆపత్రిక ఆపేశారు. తిరిగ జనవరి నెలనుండి గృహలక్ష్మి వస్తోంది. ఇంకేం మంచిదేగా! బాలల తల్లులందరూ యీ పత్రిక చదవ వలసిందే.

— బాల.

సుమారు నాలుగేండ్లక్రిందట, అప్పటి అసాధారణ పరిస్థితులలో, ఆగిపోయి యుండిన గృహలక్ష్మి (స్త్రీల సచిత్ర మాసపత్రిక) మొన్న జనవరిలో వెలువడిన ఈ 'పునరాగమన' సంచికతో ఎప్పటి తీరున పునర్దర్శన మిచ్చున్నది.

— భారతి.

స్త్రీల సమస్యలను, చర్చించి, హక్కుల్ని రక్షించడంలో అందెవేసిన చెయ్యి గృహలక్ష్మి. దీని పునరుద్ధరణం ఆంధ్రస్త్రీలకే-కాదు-ఆంధ్రులందరికీ ఆనందదాయకం అని మా అభిప్రాయం.

— నవజీవన.

గృహలక్ష్మిని తిరగా వెలువరించినందుకు ఆంధ్రమహిళలు యెంతయినా ఆనందాన్ని వెలిబుచ్చుతారు. స్త్రీల అభ్యుదయానికని ప్రత్యేకంగా వెలువడ్డ పత్రికను స్త్రీలే పోషించుకోవాలి.

పదహారవ సంపుటిలోని తొలిసంచికలో ఆ పత్రిక ప్రత్యేకతను నిలిపే శీర్షికలన్నీ మళ్ళీ ప్రారంభమైనాయి. ఇతర రచనలు మరికొన్ని వున్నాయి. గృహలక్ష్మి యింకముందు అతి ఉత్సాహంతో మరింత ఆకర్షవంతంగా వెలువడుతూ వుండగలదని ఆశిస్తున్నాము.

— ప్రజాబంధు.

సుప్రసిద్ధ నారీమణులు శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మ, శ్రీమతి పాకల రాజామణెమ్మ, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, శ్రీమతి వంగల వాణీబాయిగార్లు తమతమ ఉత్తమ వ్యాసములతో నీపత్రిక నాదరించుచున్నారు. శ్రీమతి మైదవోలు పద్మావతమ్మగారు రచించిన "అనుకూల దాంపత్యమునకు సులభోపాయములు" భర్తలందరు గమనింప దగినవిగా నున్నవచ్చును. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారి జీవిత చరిత్రము ఆంధ్రనారీమణుల కుత్సాహము గొల్పునదిగా రచింపబడినది. సంపాదకీయములు నూతనఫణితి నుజ్వలముగా నున్నవి. బ్రతుకుతెరువు, గృహవైద్యము, పాకకళ ఇత్యాదులను, గృహలక్ష్మికి నిత్యకృత్యమున కత్యవసరమైన సంగతుల నెన్నిటినో తెల్పుచున్నవి. మొత్తమున కీ "గృహలక్ష్మి" ఆదర్శము అని ఆకాశ హర్మ్యముల గట్టక వాస్తవిక జగత్తునంటి నడుచుచున్నది. అట్లని ఆదర్శ రహితముగాదు. ఆంధ్రనారీమణుల దృష్టిపథమున ఉత్తమ స్త్రీధర్మముల నాదర్శముగా నుంచి ప్రత్యక్షజీవితవిధానమున మేలుపద్ధతికి మార్గముల చూపుచున్నది, అని మా అభిప్రాయము.

— త్రిలిఙ్గ.



# స్వీకారము-విమర్శ

## మాతృభూమి.

మద్రాసులో క్రొత్తగా 26-1-47 న వెలువడిన "మాతృభూమి" అనే తెనుగుజాతీయ వారపత్రిక 1, 2, 3, 4 సంచికలు మాకార్యాలయానికి రాగా కృతజ్ఞతతో స్వీకరించినాము. సంపాదకులు శ్రీ వేలూరి సదానందంగారు; సహాయ సంపాదకులు శ్రీమతి శ్రీరాజ్యం, వేలూరి సహజానందంగార్లు. ప్రకాశకులు శ్రీ అన్నే అంజయ్యగారు. వీరందరు దేశభక్తులు, కాంగ్రెసు వాదులు, ఇందు కొందరు త్యాగంచేసి బాధలను పొందినవారు. వేలూరివారు ఆంధ్రదేశంలోగల విద్వత్కుటుంబాలలో ఒకరు. వారు ముఖ్య సంపాదకులు కావడం ఈ పత్రిక పురోభివృద్ధిని సూచిస్తున్నది. సహాయసంపాదకులలో నొకరు స్త్రీయగుట మాకత్యంతమూ హర్షదాయకము. ఆమె పాశ్చాత్య విద్యావేత్తయగుటేగాక ప్రస్తుత రాజకీయములను క్షుణ్ణంగా తెలిసిన యువతికూడా అని వింటున్నాము. కావున ఆమె సహాయసంపాదకత్వము అలంకార ప్రాయంగాక ప్రయోజనకారియేయని తలంచుచున్నాము. మాయూహ కనుగుణ్యంగా ఇందు స్త్రీ సమస్యలగూర్చిన రచనలకు కూడా సరిసమానమగు ప్రాధాన్యత నిస్తున్నారు. ఈ పత్రిక చిరకాలము వర్ధిల్లుగాకయని కోరుచున్నాము. చందా సాలీనా రు|| 13-0-0 లు. వలయువారు వారికార్యస్థానానికి 379, యస్ప్లనేడ్, చెన్నపట్నం, 1, అని వ్రాయండి.

## జయకేరళ,

జయకేరళ అనే మళయాళపు జాతీయ వారపత్రికయు ఈసంవత్సరారంభం(1947 జనవరి)నుండి వెలువడుచున్నది. ఇది భాషా ప్రయుక్తరాష్ట్ర సిద్ధాంత మంగీకరించి ఐక్య కేరళము నుద్ఘాటిస్తున్నది. కేరళమున కమ్యూనిష్టుల అల్లరుల నంగీకరించదుగాని దాని నరికట్టుటకు ఆర్డినెన్సు ప్రయోగము సమ్మతింప జాలకున్నది. సాంఘిక విషయములలో సంస్కరణ పరాయణమైయున్నది. కళలు, శాస్త్రములు, హిందూ విజ్ఞానము మున్నగు వాని నన్నిటిని ప్రోత్సాహించుచున్నదీ పత్రిక. దీని సంపాదకులు ఆర్. రాముని మీనన్‌గారు. లోధ్ర ముద్రణాలయము ననే నిదియు ప్రచురింప బడుచున్నది.

## నవజీవన

నవజీవన నేడు వారపత్రికగా వస్తున్నది. ప్రథమ సంచిక మాకార్యాలయ మలంకరించినది. ఇది ముఖ్యముగ హరిజనుల సమస్యలను చర్చించు పత్రిక. సంపాదకులు పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బి. ఎస్. మూర్తిగారి ధర్మపత్ని శ్రీ ఆదిలక్ష్మీమూర్తిగారు. హరిజన పత్రికను హరిజన గృహలక్ష్మి నడపడం చాలా సంతోషకరమైన విషయం. న్యాయంగాను, సహజంగాను ఈపత్రిక హరిజన దేవాలయ ప్రవేశమునకు తొందర పడుతున్నది. శ్రీ కోటిరెడ్డిగారు తిరుపతి దేవాలయం వాకిళ్లను హరిజనులకు వెంటనే తెరవలేదని కారాలు మిరియాలు నూరుతున్నది. అన్నివిధాల ఇది "నవజీవన" అనే దానికితగి ఉన్నది. కొంచం దూకుడు తగ్గించి నిర్మాణ పూర్వకమగు వాఙ్మయంతో పత్రికనడిస్తే హరిజనోద్ధారణ, చూపి, చెప్ప గలిగి నంతగా ఇదిసాగింపగలదని మావిశ్వాసం-సాలు చందా రు 10 లు. వలయువారు వారికార్యాలయానికి 2/20 రండాల్స్ రోడ్డు, వేపేరి, మద్రాసు అనివ్రాయండి.

1 శ్రీమతికమలానెహ్రూ 2 అన్నపూర్ణా సుభాషిత రత్నావళి 3 మహిళా ప్రబోధం 4 క్రాంతి గీతాలు 5. లోభి, అనేగ్రంథాలు కూడా వచ్చియున్నవి. వచ్చేనెలలో వాటిని విమర్శిస్తాము.

Printed and Published by Dr. S. Seshagiri Rao. at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.

ఏప్రిల్ 10 విడుదల



వాహినీవారి

# యోగి వేమన

నాగయ్య, లింగమూర్తి, రామిరెడ్డి, రాజమ్మ, పార్వతీబాయి, కాంతామణి

డైరెక్టరు – కే. వి. రెడ్డి, B.Sc (Hons)

STUDIO – NEWTONE